sunday magazine

# ఆదివారం ఆంధ్రజ్యోతి

23 అక్టోబర్ 2016





## 'స్టార్' మేకర్

## సొగసుల దేశం స్లోవేనియా








## భలే బడి!





# ఇప్పుడు పింక్ ముద్దు

ఫంక్షన్లకు నల్లరంగు దుస్తులు, పరామర్శలకు తెల్లరంగు దుస్తులు, ప్రివ్యూలకు కలర్‌ఫుల్ దుస్తులు ధరించే తారలు ఫంక్షన్లను బట్టే కాదు సీజన్‌ను బట్టి కూడా 'రంగులు' మారుస్తుంటారు. ఫ్యాషన్ ప్రపంచంలో కొన్నిసార్లు ఎరుపు, కొన్నిసార్లు పసుపు, కొన్నిసార్లు నీలివర్ణాలు డామినేట్ చేస్తుంటాయి. ఆయా సీజన్లలో స్టార్లంతా దాదాపుగా ఒకేరంగును ఫాలో అవుతుంటారు. ఇక్కడ కనిపిస్తున్న బాలీవుడ్ తారలను చూస్తుంటే ప్రస్తుతం 'పింక్' హవా నడుస్తున్నట్లు కనిపిస్తోంది. డిజైన్లు వేరైనా రంగు మాత్రం ఒక్కటే. ఆయా సందర్భాల్లో కెమెరాకు చిక్కిన 'పింక్' బ్యూటీలపై మీరూ ఓ లుక్కేయండి.

## ఇండెక్స్








# ఆదివారం ఆంధ్రజ్యోతి

23 అక్టోబర్ 2016


## ఇన్‌బాక్స్

### దసరా కానుకల్లా ఉన్నాయి

దసరా సందర్భంగా ఇచ్చిన 'బంగారు బతుకమ్మ ఉయ్యాలో', 'జగజ్జనని శక్తి స్వరూపిణి' కథనాలు చాలా బాగున్నాయి. ప్రాంతీయ భేదాలను మరిచి అన్నదమ్ములుగా కలిసుండాలనే తెలుగుప్రజలందరూ కోరుకుంటున్నారు. నేను తెలంగాణ ఆడబిడ్డను. ప్రతి సంవత్సరం నా అత్తారిల్లు ఆంధ్ర నుంచి పుట్టింటికి బతుకమ్మ పండుగ చేసుకోవడానికి వస్తుంటాను. ప్రతి పువ్వులోనూ తల్లి దాగి ఉంది. బంగారు బతుకమ్మ పండుగను కళ్లకు కట్టినట్టుగా చూపించడంతో పాటు విజయదశమి నాడు జగజ్జనని గురించి కూడా చదివించిన ఆంధ్రజ్యోతికి ధన్యవాదాలు. 'పండుగ స్పెషల్ వంటలు' నోరూరించాయి.

**- నీలిమ సబ్బిశెట్టి,** రాజానగరం

### ఈ జోడీ అదిరింది

'సాధువుల అంతిమ లక్ష్యం మోక్షం కారాదు, వ్యాపారం కేవలం లాభాపేక్షతో చేయరాదు' అనే బాబా రామ్‌దేవ్ అభిప్రాయం నిజంగా అభినందనీయం. దీన్ని వ్యాపారవేత్తలందరూ ఆదర్శంగా తీసుకోవాలి. స్వదేశీ మంత్రం, సరసమైన ధరలు, అంతకుమించి మంచి నాణ్యతగల వస్తువులు 'పతంజలి' ఉత్పత్తులను ఉన్నతమైన స్థానంలో నిలబెట్టాయి. బాబారామ్‌దేవ్, ఆచార్య బాలకృష్ణ జోడీ మరిన్ని ఉత్పత్తులతో మార్కెట్లో ఉన్న కార్పొరెట్ కంపెనీలకు గట్టి పోటీగా నిలిచే అవకాశం దగ్గర్లోనే ఉంది.

**- టి.ఎస్.ఎన్. మూర్తి,** విశాఖపట్నం

### ఆలోచింపచేసిన కథ

ఈ వారం కథ 'సేద్దెగాడు' చదివాక చాలా బాధగా అనిపించింది. గత తరం మనుషులు శ్రామికుడిని, కర్షకుడిని, శ్రమైక జీవనాన్ని కొంతైనా గౌరవించేవారు. కాని ఈ తరం యువత ఒళ్లు వంచి పనిచేయడాన్ని నామోషీగా, చదువురానివాళ్లు మాత్రమే చేసే పనిగా భావిస్తున్నారు. మన పిల్లలు శ్రమ పడకూడదని, ఏసీ గదుల్లో ఉద్యోగం చేసుకోవాలని కోరుకోవడం మంచిదే కాని కష్టపడి పంట పండించే రైతు లేకపోతే తినడానికి తిండి దొరకదనే విషయాన్ని మరిచిపోతున్నారు. పెరిగిపోతున్న వ్యాధులకు కారణం మనం మన పిల్లల్లో పెంచిన బద్ధకమే. మంచి సందేశాన్ని అందించిన రచయిత సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డిగారికి అభినందనలు.

**- ఎన్. సుబ్బలక్ష్మి,** హైదరాబాద్

• • •

'సేద్దెగాడు' కథ చాలా బాగుంది. సేద్యాన్ని నమ్ముకున్న సేద్యగానికి పెళ్లి కావాలంటే తన జీవన విధానాన్ని తెగనమ్ముకోవాల్సిన కాలంలో ఉన్నామని చెప్పారు. అయితే కథ చివరలో రచయిత భావన వింతగా అనిపించింది. 'ఆడపిల్లల్ని సోమరులుగా సాకటం నాగరికతగా భావించే తల్లిదండ్రుల కోసం పల్లెనొదిలి పట్నం వెళ్లే రైలు ఎక్కవలసిందేనా?' అంటూ ఆయన వేసిన ప్రశ్న కేవలం ఆడపిల్లల తల్లిదండ్రులకు ఉద్దేశించిందా లేక మొత్తం సమాజానికా తెలియలేదు.

**- పెండికట్ల పాపారావ్,** అమలాపురం

### రియలిస్టిక్ క్రైమ్ కహానీలు

'రియల్ క్రైమ్ కహానీ'లు చాలా ఆసక్తికరంగా ఉంటున్నాయి. ఈ వారం వచ్చిన 'పాపం పసివాడు' కథనం కూడా చాలా బాగుంది. కన్నకొడుకునే చంపే క్రూరత్వం నిండిన తల్లులు కూడా ఉన్నారా అని ఆశ్చర్యమేసింది. చాలా బాధేసింది. సమాజంలో జరుగుతున్న నేరాలు, వాటి వెనుక వున్న సంగతులను వివరిస్తూ.. ఆసక్తిదాయకంగా రాస్తున్న ఈ కహానీలు యదార్థ పరిస్థితులపై అవగాహన కలిగించేలా ఉంటున్నాయి.

**- ఇమ్రాన్ ఖలీద్, చాంద్ పాషా సయ్యద్,** ఈమెయిల్

### హై'జల'బాద్ అనొచ్చు

సినిమా ప్రారంభానికి ముందు వచ్చే యాడ్‌లా 'ఈ నగరానికేమయింది' అంటూ చిత్తలూరి రాసిన కవిత నేడు భాగ్యనగరంలో నివసిస్తున్న అభాగ్యుల దుస్థితికి నిదర్శనంగా నిలిచింది. వర్షం కురిస్తే చాలు హై'జల'బాద్‌గా మారిపోతున్న మన విశ్వనగరం ఎప్పటికి ఈ పరిస్థితి నుంచి బయటపడుతుందో చూడాలి. సులువుగా వచనరీతిలోనే పదాలను కూర్చి తన భావుకతను ప్రదర్శించిన కవి అభినందనీయులు.

**- వద్ది దుర్గారావు,** ఎల్ఎన్‌డీ పేట

'ఆదివారం అనుబంధం'పై మీ అభిప్రాయాలను శుక్రవారంలోగా అందేలా పంపగలరు. ఆలస్యంగా అందిన ఉత్తరాలు ప్రచురించడం సాధ్యపడదని మనవి. sunday.aj@gmail.com కి మీ ఉత్తరాల్ని మెయిల్ చేయవచ్చు.



రణ్‌వీర్‌సింగ్, పరిణీతి చోప్రా, అలియాభట్, అర్జున్‌కపూర్... వీళ్లంతా 'స్టార్లు'గా మారడానికి కారణమెవరో తెలుసా? షానూ శర్మ. బొద్దుగా, పెద్ద ముక్కుపుడకతో, పెద్ద పెద్ద చెవి రింగులతో, చేతులకు పెద్ద గాజులతో, మెడలో భారీసైజు ఆభరణాలను ధరించి విభిన్నంగా కనిపిస్తుందామె. ఎంతమందిలో ఉన్నా షానూను ఇట్టే గుర్తుపట్టొచ్చు. ఆమె కూడా అలాగే 'స్టార్' మెటీరియల్‌ను ఇట్టే గుర్తుపడుతుంది. మొదటిచూపులోనే ఒక వ్యక్తిలోని నటుడు, నటిని కనిపెట్టి దర్శకులకు సిఫారసు చేస్తుంది. ఇంతకీ షానూ శర్మ ఎవరనుకుంటున్నారు? బాలీవుడ్‌లో ప్రసిద్ధి చెందిన కాస్టింగ్ డైరెక్టర్. ఏ దర్శకుడైనా ఫలానా పాత్రకు తగ్గ నటీనటులు కావాలంటే షానూ శర్మనే సంప్రదిస్తారు.

# స్టార్‌ను ఇట్టే పట్టేస్తుంది

పబ్స్, మాల్స్, కాలేజ్ ఫెస్టివల్స్, సెలూన్స్, కాఫీ షాప్స్, జిమ్స్... ఇలా ఎక్కడైనా షానూ శర్మ (36) కనిపిస్తుంది. ఆయా ప్రదేశాల్లో ఎంజాయ్ చేస్తున్న కుర్రకారును నిశితంగా, నిశ్శబ్దంగా పరిశీలిస్తుంటుంది. తనకు కావాల్సిన 'స్టార్ మెటీరియల్ ఉన్న వ్యక్తి కోసమే ఆమె అన్వేషణ. ఒక్కసారి ఆమె కంట్లో పడితే చాలు బాలీవుడ్ తెరపై వెలిగే ఛాన్స్ కొట్టేసినట్టే. రణ్‌వీర్‌సింగ్‌ను ఆమె చూసి ఓకే చేసింది ఒక నైట్‌క్లబ్‌లో. 2010లో యష్‌రాజ్ ఫిలిమ్స్ తీయబోయే రొమాంటిక్ కామెడీ 'బాండ్ బాజా బరాత్' సినిమాలో అనుష్కశర్మ సరసన నటించేందుకు ఒక కొత్త కుర్రాడిని వెదికే బాధ్యతను ఆ సంస్థ అధినేత ఆదిత్యచోప్రా షానూ శర్మకు అప్పగించారు. 'రణ్‌వీర్ మీకు తగ్గ కుర్రాడు' అని ఒకే ఒక్క మాటలో చెప్పేసిందామె. అయినా రణ్‌వీర్‌ను చూడగానే యూనిట్ సభ్యులకు అనేక సందేహాలు కలిగాయి. కానీ ఆడిషన్ తర్వాత అందరూ షానూ శర్మ ఛాయిస్‌కే ఓటేశారు. ఆ తర్వాత రణ్‌వీర్‌సింగ్ అంచెలంచెలుగా 'స్టార్'గా ఎలా ఎదిగాడో అందరికీ తెలిసిందే. " ఇప్పటికీ అవార్డు అందుకున్న ప్రతీసారి రణ్‌వీర్ నాకు థాంక్స్ చెబుతుంటాడు. అతడికి నా మీదున్న అభిమానం అలాంటిది" అంటూ నవ్వుతుంది షానూ.



ఒక్క రణ్‌వీర్‌సింగ్ మాత్రమే కాదు... షానూ శర్మ సిఫారసు చేసిన వారిలో అర్జున్‌కపూర్, అలియాభట్, పరిణీతి చోప్రా, వాణీకపూర్, భూమిక పడ్నేకర్... ఇలా పెద్ద లిస్టే ఉంది. అలాగే యష్‌రాజ్ ఫిలిమ్స్ తీసిన 'సుల్తాన్', 'ఫాన్', 'ఏక్ థా టైగర్', 'జబ్ తక్ హై జాన్', 'మర్దానీ', 'గుండే', 'ధూమ్ 3' వంటి అనేక సినిమాలకు కాస్టింగ్ డైరెక్టర్‌గా ఎంతోమందిని తెరకు పరిచయం చేసింది షానూ. ప్రధాన పాత్రలకు కూడా నటీనటులను రికమెండ్ చేసింది. "ఒక పాత్రకు కావాల్సిన నటీనటులు ఎలా ఉండాలో దర్శకుడు కనిపెట్టలేకపోవచ్చు. కానీ కాస్టింగ్ డైరెక్టర్‌గా అది నాకు ఛాలెంజ్‌లాంటిది. ఒక సినిమాకు కావాల్సిన నటీనటుల కోసం నేను, మా బృందం ఎప్పుడూ రోడ్ల మీద తిరుగుతూనే ఉంటాం. ఎక్కడో ఒక చోట చివరికి ఆటోలోనో మన పక్కనే కావాల్సినవారు దొరుకుతారు. 'దమ్ లగాకే హైసా' సినిమా కోసం తెరవెనుక పనిచేస్తున్న భూమి పడ్నేకర్‌లో నటిని చూసింది నేనే" అని చెప్పారు షానూ.

ఫేస్‌బుక్, ట్విట్టర్, ఇన్‌స్టాగ్రామ్ వంటి సామాజిక మాధ్యమాల ద్వారా కూడా అనేక ఫోటోలు షానూ శర్మ కార్యాలయానికి ప్రతీరోజూ వస్తుంటాయి. వాటిని ఆమె అసిస్టెంట్లు వడపోసి సోమ, మంగళవారాల్లో షానూ ముందు పెడతారు. ఆడిషన్స్ నిర్వహించి కొందరిని సెలెక్ట్ చేసి, వారిని ఆయా దర్శకులకు రికమెండ్ చేస్తుంటుందామె. షానూను అంతా పని రాక్షసి అంటుంటారు. ఆమె దగ్గర పనిచేయడం చాలా కష్టమని చెబుతుంటారు కూడా. 'సారీ', ' నా వల్ల కాదు', 'మర్చిపోయాను' వంటి పదాలను వినేందుకు ఆమె అస్సలు ఇష్టపడదట. కేవలం నూతన నటీనటులను వెదకడమే కాకుండా పలువురు దర్శకులు చెప్పే కథ, పాత్రల తీరుతెన్నుల ఆధారంగా ఎంతోమంది స్టార్లను ఆయా పాత్రలకు షానూ రికమెండ్ చేసింది. వారిలో దీపికా పదుకొనే (పీకూ), కంగనా రనౌత్ (క్వీన్, తను వెడ్స్ మను), ఇర్ఫాన్‌ఖాన్, నిమ్రత్ కౌర్ (లంచ్‌బాక్స్) వంటివారున్నారు. సాధారణంగా కనిపించే యువతీ యువకుల్లోని 'స్టార్ మెటీరియల్‌ను సులువుగా కనిపెట్టే షానూ మరి తనకు కాబోయేవాడిని కనిపెట్టగలిగిందా? ఆ మాట అడిగితే " ఇదే అప్పుడప్పుడు నన్ను భయపెడుతోంది. ఏదో ఆశించి నాకు దగ్గర కావాలనుకునేవారే నాకు ఇప్పటిదాకా కనిపించారు. నాకు సరైన భర్తను వెదుక్కోవాలని, పిల్లలను కనాలని, ఒక రెస్టారెంట్‌ను కూడా ప్రారంభించాలని... ఎన్నో కలలున్నాయి. ఎంతయినా నేనూ ఆడపిల్లనే కదా" అంది ఈ స్టార్ మేకర్. ■

## నవ్వేజోన్






**('త్రిశూలం' చిత్రంలోని 'రాయిని ఆడది చేసిన రాముడివా' పాటకు)**

**వ**యసుని చెప్పక దాచిన దొంగవా
విగ్గును తలపై పెట్టిన వరుడివా
ఏమనుకోను నిన్నేమనుకోను

నువ్వు పిల్లవు కావు పడుచువు కావు
నే ముదిరిన బెండను కానే కాను
ఫిక్సయిపో సిక్స్ ప్యాకనుకో

**పేరడీ**



నువ్వేంటి నీకంతటి ఏజేంటి?
నీ అంతటి ముదురుతోటి నాకు పెళ్లేంటి!
తలకేంటి నువ్వు వేసిన రంగేంటి?
ముఖం వదలి నెత్తిమీద గ్రౌండేంటి
విగ్గు లేని జుట్టంటే లోకమొప్పుతుందా!
జుట్టులాంటి విగ్గునైన గుర్తుపట్టకుందా!
ఇది మాయే కదా! నా తలరాతే కదా!

మోకాళ్లు .. పడుకుంటే తిమ్మిర్లు ..
కూర్చుంటే లేవలేక ఎన్నేళ్లు
నీ కళ్లు రాత్రులలో మసకల్లు ..
రేచీకటి బతుకంతా కన్నీళ్లు
వివాహాలు జరిపించే మనిషి కదా పంతులు
ఆ అబద్దాలు నమ్మి కదా పడ్డాను గోతిలో
అది నిజం కదా .. మన కథ ఇంతే కదా!

● లేటు వయసులో పెళ్లి నేపథ్యంలో కామెడీగా రాసింది.

**- కె. సిద్ధార్థ, 91333 66955**

## ఫటాఫట్



**సముద్రాన్ని దాటిన బస్?**
- కొలంబస్

**స్త్రీవాద రచయిత్రి?**
- సూర్యుడ్ని సూరమ్మ అని, చంద్రుడ్ని చంద్రత్త అని రాసే వ్యక్తి.

పంపినవారు :
**- సిహెచ్‌వివిఎస్ మూర్తి,** పాల్వంచ

## ఔరా!

**జలుబు ముక్కుకే ఎందుకు పడుతుంది?**
- బహుశా 'ఐస్' మధ్యలో ఉన్నందుకేమో!

**అర్థం కానిది?**
కన్నది తల్లిదండ్రులైతే, బర్త్ సర్టిఫికెట్ అధికారులు ఇవ్వడం!
**- అబ్బగాని భాస్కర్,** మహబూబాబాద్

## క్యా డైలాగ్ హై



● 'ఖాళీగా ఉన్న అమ్మాయిని ఎవడైనా పడేస్తాడు. కాంపిటీషన్‌లో ఉన్న అమ్మాయిని పడేసినోడే కింగ్ అవుతాడు'.
- చిత్రం : **ప్రేమమ్**



● 'బతుకు బాగు కోరుకుంటుంది. ఊరు పరువు కోరుకుంటుంది'.
- చిత్రం : **బ్రహ్మోత్సవం**



● 'జీవం ఇద్దరు మనుషుల కలయిక. మరణం అనేక మార్గాల కూడిక'.
- చిత్రం : **దరువు**




# తకథిమి తోం.. తకథిమి తోం

సుకుమార్‌గారు దర్శకత్వం వహించిన తొలి చిత్రం 'ఆర్య'. అందులో మొదటి పాట రాసే అవకాశం నాకు వచ్చింది. నిజానికి సుకుమార్‌గారు నాకు కథ చెప్పలేదు. కేవలం మూడు సీన్స్ చెప్పి "మీరు ఒక ఎనర్జిటిక్ కుర్రాడిని ఊహించుకొని ఏది రాయగలిగితే అది రాసేయండి, నాకు మ్యాచ్ అయితే చూద్దాం" అన్నారు. వెంటనే ఆ చిత్రానికి సంగీతం అందించిన దేవీశ్రీ ప్రసాద్ గారిని కలిస్తే ఆయన ట్యూన్ వినిపించారు. ఆయన సాధారణ మ్యూజిక్ డైరెక్టర్ మాత్రమే కాదు, తన మ్యూజిక్‌తో సినిమాను హిట్ చేయగలిగిన సత్తా గల డైరెక్టర్. ట్యూన్ ఇచ్చి పల్లవిలో ఈ పదాలు వాడితే బావుంటుందని కొన్ని పదాలు కూడా చెప్పారు. ఆయన స్టూడియోలోనే కూర్చొని ఒక్క రాత్రిలో పాట మొత్తం రాసేశాను.

**'తకథిమి తోం.. తకథిమి తోం..**
**తరికిట తరికిట తకథిమి తోం..**
**చిందులు వేసే వయసుకి తకథిమి తోం..'**

ఇలా మొదలవుతుంది పాట. పొద్దున్నే ప్రొడ్యూసర్ 'దిల్'రాజు గారికి వినిపిస్తే చాలా బాగుందన్నారు. షూటింగ్‌లో బిజీగా ఉన్నందువల్ల సుకుమార్ గారికి ఫోన్‌లో వినిపించాం. ఆయన కూడా బాగుందని మెచ్చుకున్నారు. ఒక్కరోజులోనే రికార్డింగ్‌కి పంపించారు. 'తకథిమి తోం' శబ్దాన్ని ప్రతీ చరణానికి ముగింపుగా వాడాను. అది దేవీశ్రీ ప్రసాద్‌గారు ఇచ్చిన సలహానే.

**'చిరునవ్వుతో అటు చీకటిని, ఇటు ఓటమిని తరిమేయరా..**
**ఆ ఓర్పుకి తకథిమి తోం..**
**నీ మాటతో అటు నిశ్శబ్దం, ఇటు ఓ యుద్ధం ఆగాలిరా..**
**ఆ నేర్పుకి తకథిమి తోం..'**

చాలామందికి ఈ లైన్లు చాలా నచ్చాయి. సుకుమార్‌గారయితే "కథ మొత్తం రాసిన నేనే ఈ పాటను కూడా రాశానేమో అనుకుంటున్నారయ్యా.. అంత బాగా రాశావు" అని మెచ్చుకున్నారు.

అలాగే ఒకసారి నా స్నేహితుడు,డైరెక్టర్ శేఖర్‌సూరి ఇంటికి వెళితే అక్కడ ఒక రిటైర్డ్ మిలటరీ ఆఫీసర్ కలిశాడు. ఆయన ఈ రెండు లైన్ల గురించి ఒక గంటసేపు మాట్లాడాడు. "ఒక చిరునవ్వుతో జీవితంలోకి వచ్చిన కష్టాలనే చీకట్లను తరమేయాలని ... సహనం కోల్పోకూడదని.. ఓటమిని ఓడించే ఓర్పు ఉండాలని రాశారు. అలాగే ఒక చిన్న మాట ప్రళయం కంటే భయంకరమైన నిశ్శబ్దాన్ని, ప్రాణాలను తీసే యుద్ధాన్ని ఆపగల నేర్పు ఉండాలనే విషయాలన్ని కూడా చాలా చక్కగా చెప్పారు" అని ఎంతో మెచ్చుకున్నారు. భగవద్గీతలో కృష్ణుడు అర్జునుడికి ఉపదేశించిన సంగతుల నుంచి ఆయన సర్వీసులో ఉన్న సమయంలో జరిగిన సంఘటనలనెన్నిటినో ఉదాహరణలుగా చెప్పారు. నా జీవితంలో ఎటువంటి సన్మానాలు, సత్కారాలు అందుకోకపోయినా అంత అనుభవం ఉన్న వ్యక్తి మనసుని తాకేలా పాట రాయగలిగాను అనే సంతృప్తి నాకు చాలానిపించింది. దానిముందు మిగతావన్నీ వేస్ట్ అనిపించింది.

నా పాట...25

### ఎవడి గోల వాడిదే...

'ఎవడి గోల వాడిదే' సినిమా షూటింగ్ మొత్తం పూర్తయ్యాక ఈ.వి.వి. సత్యనారాయణగారు నన్ను పిలిచి "సినిమాలో క్లైమాక్స్ సీన్ 30 నిమిషాలు వచ్చేలా ఉంది. అంత సుదీర్ఘమైన క్లైమాక్స్ అంటే థియేటర్‌లోంచి జనం పారిపోతారు. కాబట్టి నువ్వేం చేస్తావో నాకు తెలీదు. ఆ 30 నిమిషాల క్లైమాక్స్‌ను నువ్వు 12 నిమిషాల పాటగా మార్చాలి" అన్నారు. సినిమా ఎంత నిడివి ఉండాలో, పాట ఎంత సేపు ఉండాలో, ఎమోషన్ ఎంత సేపు ఉంటే ప్రేక్షకులకు ఆ ఫీల్ వస్తుందో తెలిసిన దర్శకుడు ఈవీవీగారు. అది నా జానర్ కాకపోయినా సినిమాలో ఆ పాట చాలా కీలకమైంది. సరేనన్నాను.

'స్నేహితుడా.. స్నేహితుడా', 'దేవుడే ఇచ్చాడు వీధి ఒక్కటి..', 'ఏమెట్టి చేశాడే ఆ బ్రహ్మ..', 'నువ్వు విజిలేస్తే..', 'తూనీగ.. తూనీగ', 'ఆ అంటే అమలాపురం'.. ఇలా తెలుగు సినిమాల్లోని 25 ఆల్‌టైమ్ సూపర్ హిట్ సాంగ్స్‌కు పేరడి సాంగ్స్ చేసి బిట్ సాంగ్స్‌గా రాశాను. అదేమంత క్రియేటివ్ వర్క్ కాకపోయినా హిట్ సాంగ్స్‌కి సరిగ్గా సరిపోయే పదాలతో పేరడి రాయాలి... అది డైలాగ్స్‌ను పాట రూపంలో పాడుతూ చెబుతున్నట్టుగా ఉండాలి. ఆ విధంగా ప్రేక్షకులను నవ్వించాలి. చాలా కష్టం అనిపించినా ఈవీవీ గారు నా మీద పెట్టుకున్న నమ్మకాన్ని నిలబెట్టుకోవాలనే కసితో రాశాను. సినిమాలో చాలా బాగా వచ్చింది. నాకు చాలా మంచి పేరు కూడా తెచ్చింది. ఈవీవీగారు చాలాసార్లు "ఆ సినిమా సిల్వర్‌జూబ్లీ ఆడిందంటే క్లైమాక్స్‌లో నువ్వు రాసిన పాటే కారణమయ్యా.." అన్నారు. ఇండస్ట్రీకి వచ్చినప్పటి నుంచి ప్రతీ సినిమాలో పాట రాసే అవకాశం ఇచ్చి, ఒక అప్పుడిగా నన్ను ఎంతో ప్రోత్సహించిన ఈవీవీగారు ఈరోజు లేకపోవడం నాకు ఒక తీరని లోటు.




**సురేంద్రకృష్ణ- 97000 33306**

# ఆ మొదటివాడు ఎవరంటే...!

ఒకానొక రాజ్యంలో రాజుగారు తన మహామంత్రిని పిలిచి "మన రాజ్యంలో మహా తెలివైన వారు ఉన్నట్లే, మహా తెలివితక్కువ వాళ్లూ ఉంటారు కదా?" అని అడిగాడు.

మంత్రి (సంశయిస్తూనే) "అవును.. ఉంటారు ప్రభూ" అన్నాడు.

"అయితే మన రాజ్యమంతా గాలించి, అందరిలో కెల్లా అతి తెలివితక్కువ వాళ్లను అయిదుగురిని వెదికి పట్టుకుని, సభలో హాజరు పరచండి" అని ఆజ్ఞాపించాడు రాజు.



మంత్రి 'చిత్తం ప్రభూ' అని సభ నుంచి నిష్క్రమించాడు గానీ మనసంతా 'ఎలా?' అన్న ఆలోచనలతోనే నిండిపోయింది.

'ఎవడికైనా కొన్ని పరీక్షలు పెట్టో, ప్రశ్నలు అడిగో వాడు తెలివైనవాడో, కాడో తేల్చుకోవచ్చు. మరి, తెలివితక్కువ వాడినెలా గుర్తించాలి?' ఈ సంకటం నుండి బయటపడటమెలాగో అర్థం కాలేదు మంత్రికి.

మందహాసం

'ఒప్పుకున్నాక తప్పదుగా, రాజాజ్ఞ మరి' అని నిట్టూర్పు విడిచి తెలివితక్కువ వాళ్లను వెదకడానికి బయలుదేరాడు.

ఒక నెల రోజుల పాటు రాజ్యమంతా తిరిగి ఇద్దరిని పట్టుకుని సభలో హాజరు పరిచాడు.

"మహామంత్రీ మీరు పొరబడినట్లున్నారే.. లేక లెక్క తప్పారా? మేము అయిదుగురిని ప్రవేశ పెట్టమన్నాం. మీరు ఇద్దరిని మాత్రమే వెంట తీసుకుని వచ్చారు" కోపంగా అన్నాడు రాజు.

"మహాప్రభూ! తమరు నేను చెప్పేది కొంచెం ఆలకించండి" అన్నాడు మంత్రి.



"సరే సెలవియ్యండి" అన్నాడు రాజు.

"నేను రాజ్యమంతా తిరుగుతుండగా.. ఇతను ఒక ఎడ్ల బండి మీద కూర్చుని తలపై ఒక పెద్దమూటను పెట్టుకుని వెళుతూ కనిపించాడు. అలా ఎందుకని అడుగగా 'మూటను బండి మీద పెడితే ఎడ్లకు భారమవుతుంది' అని సమాధానమిచ్చాడు. అందుకే ఇతనిని అయిదవ తెలివి తక్కువ వాడిగా తీసుకొచ్చాను" అంటూ ఆగాడు మంత్రి.

"భేష్! తరువాత..." అని అడిగాడు రాజు.

"ఈ రెండో అతను తన ఇంటి పైకప్పు మీద పెరిగిన గడ్డిని తినిపించడానికి తన గేదెను ఇంటి పైకప్పు మీదకు లాగుతూ కనిపించాడు. కావున ఇతడిని నాలుగవ తెలివితక్కువ వాడిగా ప్రవేశపెట్టాను" అన్నాడు మంత్రి.

మళ్లీ రాజు "భేష్! ఆ తర్వాత..." అని అడిగాడు.

"రాజ్యంలో చాలా సమస్యలుండగా, వాటినన్నింటిని పక్కనబెట్టి తెలివితక్కువ వాళ్లను వెదకటంలో నెలరోజుల పాటు సమయం వృథాగా గడిపాను కాబట్టి నేను మూడవ తెలివితక్కువ వాడిని" అని ఆగాడు మంత్రి.

రాజు (గట్టిగా నవ్వుతూ) "తరువాత" అంటూ మరింత ఉత్సాహంగా అడిగాడు.

"పరిష్కరించాల్సిన సమస్యలెన్నో ఉండగా, బాధ్యతలన్నీ విస్మరించి, తెలివితక్కువ వాళ్లకోసం వెదకమన్న తమరు రెండో వారు"

అది వినగానే సభలోని వారంతా నిశ్చేష్టులై చూస్తుండిపోయారు. నిశ్శబ్దం ఆవరించింది అంతటా.

రాజుకు కోపం వచ్చినా తేరుకుని "మంత్రిగారూ సందేహం లేదు. మీ మాటల్లో.. వాస్తవానికి దగ్గరగానూ, నిస్సందేహంగా నిజాయితీతో కూడిన నిజముంది. సరే మొదటి తెలివితక్కువ వారెవరో తెలియజెప్పండి" అన్నాడు.

"చేయాల్సిన పనులన్నీ మానేసి నెట్ ఆన్ చేసుకుని వాట్సాప్‌లో ఈ మెసేజ్ చదువుతున్నాడే.. వాడే ఆ మొదటివాడు."

*(వాట్సప్ నుంచి)*

# చదువుల గుడి పొందూరు బడి

**ప్రభుత్వ స్కూళ్లన్నీ ఒకేలా ఉండకపోయినా ఎక్కువ స్కూళ్లలోకి 'సరస్వతి' తొంగి కూడా చూడదనే అభిప్రాయం మనకు బలంగా ఉంది. సార్లు, మేడమ్‌లూ స్కూలుకు రారని, వచ్చినా పాఠాలు చెప్పరని, చెప్పినా బాగా చెప్పరని చాలామంది నిశ్చితాభిప్రాయం. కొన్ని మినహాయింపులున్నాయని చెప్పినా నమ్మరు. అందుకే పొందూరు హైస్కూలును మీ ముందు పెడుతున్నాం. 'పొందూరు ఖద్దరు'లాగే ఈ బడికీ ప్రత్యేకత ఉంది. ఏళ్ల తరబడి సెలవులు కూడా పెట్టకుండా విద్యాబోధన చేసే గురువులున్నారక్కడ. వందకు వందశాతం ఫలితాలు సాధించిన విద్యార్థులున్నారక్కడ. ప్రైవేటు, కార్పొరేట్ పాఠశాలలను కాదని ఆ బడిలో తమ పిల్లలను చేర్పించేందుకు క్యూలు కట్టే తల్లిదండ్రులున్నారక్కడ. ఆ విశేషాలే ఈ వారం కవర్‌స్టోరీ.**



'ప్రభుత్వ పాఠశాలల్లో ఏముంది? పాఠాలు కూడా సరిగ్గా చెప్పరు. అక్కడ చేరితే ఉన్న కొద్ది చదువూ పోయి పిల్లోడు మొద్దుగా మారుతాడు. భవిష్యత్తులో ఎందులోనూ రాణించడు' ఇదీ సగటు తల్లిదండ్రులకు సర్కారు బళ్లపై ఉన్న అభిప్రాయం. కానీ శ్రీకాకుళం జిల్లాలోని ఈ ప్రభుత్వ ఉన్నత పాఠశాలకున్న పేరు పూర్తిగా వేరు.

'ఫీజులు తగ్గిస్తాం... చేరండి' అని ప్రైవేటు పాఠశాలలు, కార్పొరేట్ స్కూళ్లు కాళ్లావేళ్లాపడినా సరే పొందూరులో తల్లిదండ్రులు తమ పిల్లలను ఈ స్కూల్లోనే చేర్చుతారు. అక్కడ చదివితేనే తమ బిడ్డలు బంగారుకొండలు అవుతారని వారి నమ్మకం. 1,178 మంది విద్యార్థులు, 48 మంది ఉపాధ్యాయులతో పొందూరు ప్రభుత్వ పాఠశాల అక్షర యజ్ఞం చేస్తోంది. అద్భుత పనితీరు, ఉత్తమ ఫలితాలతో రాష్ట్ర, జాతీయ స్థాయి బహుమతులెన్నో అందుకుంది.

## అలుపెరుగని ప్రస్థానం ...

ఈ పాఠశాల 1930లో బ్రిటిష్ ప్రభుత్వం హయాంలో బోర్డు హైస్కూల్‌గా ప్రారంభమైంది. స్వాతంత్ర్యానంతరం హయ్యర్ సెకండరీ స్కూల్‌లో భాగంగా ఉండేది. 1998 ఆగస్టు 1న ప్రభుత్వ ఉన్నత పాఠశాలగా ఆవిర్భవించింది. మొదటినుంచీ ఈ స్కూలుకు వచ్చే విద్యార్థులు ఎక్కువే. అప్పట్లో ఈ ఊరుకు సమీపంలో పెద్దగా హైస్కూళ్లు లేకపోవడంతో పరిసరగ్రామాల విద్యార్థులకు ఇదే దిక్కు. ఆరు నుంచి పదో తరగతి వరకు మాత్రమే ఉంటుంది ఈ స్కూలులో. ఇంగ్లీషు, తెలుగు మీడియంలు రెండూ ఉన్నాయి. ఒక్క పదోతరగతి విద్యార్థులే 332 మంది ఉన్నారు. వీరంతా



పొందూరుకు చుట్టుపక్కలున్న పది గ్రామాల నుంచి వస్తుంటారు. ఆయా గ్రామాల్లో హైస్కూళ్లు ఉన్నా తల్లిదండ్రులు ఏరికోరి పొందూరు ఉన్నత పాఠశాలకే పిల్లలను పంపుతున్నారు.

ప్రతి విద్యా సంవత్సరం ఆరంభంలో అనేక ప్రైవేటు స్కూళ్లు, కార్పొరేట్ స్కూళ్లు మైకులతో ప్రచారం చేసి పిల్లలను తమ స్కూళ్లలో చేర్చాలని ఒత్తిడి చేస్తుంటాయి. ఫీజు రాయితీ అని, సగం ఫీజుకే సీటిస్తామని, ఉచితంగా బస్సులో తీసుకువెళ్లి తీసుకువస్తామని ఇలా ఎన్నో రకాలుగా వారిని ప్రలోభాలకు గురిచేయాలని చూసినా తల్లిదండ్రులు మాత్రం తమ పిల్లలను ఈ పాఠశాలకే పంపుతారు. దీంతో ప్రతీ యేటా విద్యార్థుల సంఖ్య పెరుగుతూనే ఉంది. ఇంగ్లీషు మీడియంలో 100 శాతం ఫలితాలు వస్తున్నాయి. గత యేడాది (2015) ఈ పాఠశాలలో పదోతరగతి తెలుగు మీడియం ఫలితాలు 98 శాతం కాగా, 2014లో 96 శాతం, 2013లో 92 శాతం వచ్చాయి. అంటే ఏటికేడు పెరుగుతోంది.

## ఆ 48 మందికి బోధనే ఊపిరి...

ఈ పాఠశాలలో పనిచేస్తున్న 48 మంది ఉపాధ్యాయులలో సగానికి పైగా పీహెచ్‌డీ చేసినవారున్నారు. తమ విధులను మొక్కుబడిగా నిర్వహించడం అంటే ఏమిటో వారికి తెలియదు. విద్యాలయాన్ని దేవాలయంలా భావించినట్టుగా పూర్తి అంకితభావంతో పాఠాలు బోధిస్తుంటారు. ఉదయం ఎనిమిదికే ఉపాధ్యాయులంతా పాఠశాలకు చేరుకుని 'జీరో అవర్' నిర్వహిస్తారు. అంటే ఆయా సబ్జెక్టులలో వెనుకబడిన విద్యార్థులను గుర్తించి వారికి స్కూలు మొదలవడానికి ముందే ఒకటిరెండు ప్రత్యేక పీరియడ్‌లు తీసుకుంటారు. ఏ ఒక్క విద్యార్థి కూడా చదువులో వెనకబడకుండా చూస్తున్నారు. సాయంత్రం పాఠశాల పూర్తయిన తర్వాత కూడా అవసరమైతే ప్రత్యేక క్లాసులు తీసుకుంటారు. అంటే సాయంత్రం నాలుగైదు గంటలకే బడి మూసేయకుండా ఆరు లేదా ఏడు గంటలదాకా కూడా పనిచేస్తారు. పాఠశాల ప్రాంగణంలోనే ఉన్న నాలుగు సంక్షేమ హాస్టళ్లలో 300కుపైగా విద్యార్థులుంటారు. హాస్టళ్లను కూడా ఆకస్మిక తనిఖీలు చేస్తూ పిల్లలు చదువుకునేలా ప్రోత్సహిస్తుంటారు. కేవలం పాఠ్యపుస్తకాల బోధనకే పరిమితం కాకుండా కంప్యూటర్ నేర్చుకుని, ల్యాబ్‌లో ప్రయోగాల కసరత్తుచేసి విద్యార్థులకు నిరంతరం కొత్త విషయాలు బోధిస్తూ వారి భవితకు బలమైన విద్యా పునాదులు వేస్తున్నారు.

## ఉపాధ్యాయులు సెలవులు పెట్టరు ...

ఈ పాఠశాల మరో ప్రత్యేకత ఏమిటంటే ఇక్కడ పనిచేస్తున్న సగానికిపైగా ఉపాధ్యాయులు ఏళ్ల తరబడి సెలవులు పెట్టనివారే. ఏడాదికి వచ్చే 22 క్యాజువల్ లీవుల్లో అయిదు కూడా వాడుకోనివారున్నారు. చాట్ల సునీత అనే ఉపాధ్యాయురాలు తన పదిహేనేళ్ల సర్వీసులో ఇప్పటిదాకా ఒక్క క్యాజువల్ లీవ్ కూడా పెట్టలేదంటే ఆశ్చర్యపోకతప్పదు. " విద్యాబోధన అనేది నాకు ఒక అలవాటుగా మారింది. స్కూలుకు సెలవులిస్తే నాకేం తోచదు. అందుకే సెలవురోజుల్లో కూడా స్కూలుకు వెళ్తాను. నాతోపాటు కొందరు పిల్లలు





వస్తారు. నాకున్న ఏకైక వ్యాపకం ఇదే" అంటారామె. సునీత పనితీరును గుర్తించి జిల్లా విద్యాశాఖ నామినేషన్ కూడా లేకుండానే ఆమెను ఉత్తమ ఉపాధ్యాయురాలిగా ఎంపిక చేసింది. ఈమె ఒక్కరే కాదు స్కూల్లో పనిచేస్తున్న చాలామంది ఉపాధ్యాయులు ఉత్తమ గురువులుగా అవార్డులు అందుకున్నారు. అంతేకాదు ఎన్. షర్మిలారాణి, సునీత, శారదాంబ, దేవి అనే నలుగురు ఉపాధ్యాయులు నెలనెలా తమకొచ్చే జీతంలో కొంతమొత్తాన్ని స్కూల్లోని పేద విద్యార్థినులకు పౌష్టికాహారం, నేప్‌కిన్లు అందించడానికి ఉపయోగిస్తున్నారు. " ఈ పాఠశాలకు ఒక ఘన చరిత్ర ఉంది. ఆ గొప్పదనాన్ని కాపాడాలని ప్రతీ ఉపాధ్యాయుడు పాటుపడటం గర్వపడాల్సిన విషయం. పొందూరు స్కూల్లో పనిచేయడం గర్వకారణమని భావిస్తారు ఉపాధ్యాయులందరూ. అందుకే తమకు అందివచ్చిన అవకాశాన్ని చక్కగా వినియోగించుకుంటున్నారు" అని చెప్పారు పాఠశాల ప్రధానోపాధ్యాయులు ఈదుల గోవిందరావు. ప్రధానోపాధ్యాయుడిగా ఎన్ని పనులున్నా పిల్లలకు పాఠాలు చెప్పకపోతే ఏం తోచదని అంటారాయన.

## చదువు, ఉద్యోగం, పిల్లల చదువు కూడా ఇక్కడే...

ఈ పాఠశాలలోని ఉపాధ్యాయుల్లో సగం మందికిపైగా ఇదే స్కూల్లో చదువుకుని తిరిగి ఇక్కడే ఉపాధ్యాయులుగా చేరడం మరో విశేషం. ఒక రకంగా పొందూరు ఉన్నత పాఠశాల విజయానికి ఇది కూడా ఒక కారణమే. వీరంతా తాము చదువుకున్న స్కూల్లోనే ఉపాధ్యాయులుగా చేరడం, విద్యార్థులకు బోధించడం గర్వకారణంగా భావిస్తున్నారు. అంతేకాదు తమ పిల్లలు కూడా ఇక్కడ

చదువుకుంటేనే మిగతా తల్లిదండ్రులకు తమ బోధనపై నమ్మకం ఏర్పడుతుందనే సదుద్దేశంతో వారు తమ పిల్లలను కూడా ఇక్కడే చేర్పించారు.

" నేను ఇక్కడే చదువుకున్నాను. ప్రస్తుతం నా కూతురు శ్రీవాణి కూడా ఇక్కడే ఆరో తరగతి చదువుతోంది. మా అబ్బాయి లలిత్‌కుమార్ తొమ్మిదో తరగతి చదువుతున్నాడు. ఇక్కడ చదివితే నా పిల్లలు కూడా జీవితంలో ఎదుగుతారనే నమ్మకం నాకుంది. అందుకే నేను చదువుకున్న ఈ స్కూల్లోనే నా పిల్లలను కూడా చేర్పించాను" అని గర్వంగా చెబుతున్నారు ఫిజిక్స్ టీచర్‌గా పనిచేస్తోన్న బలవాడ కిశోర్. మరో టీచరు వాడ్రంగి దివ్య కూడా ఇదే స్కూలు పూర్వ విద్యార్థిని. " ప్రతి ఒక్కరూ ప్రభుత్వ ఉద్యోగం కావాలని కోరుకుంటారు. ప్రభుత్వం అందించే రాయితీలు వదులుకోవడానికి ఇష్టపడరు. ప్రభుత్వ ఆస్పత్రులు, ఇతరత్రా సౌకర్యాల కోసం ఎగబడతారు. మరి ప్రభుత్వ పాఠశాలల్లో తమ పిల్లలను చదివించడానికి ఎందుకు ఇష్టపడరు? మా పాఠశాల దీన్ని అధిగమించి ప్రైవేటు పాఠశాలలకు కూడా సాధ్యం కాని ఫలితాలను సాధిస్తోంది" అని కిశోర్ అన్నారు.



సిద్ధాంతాన్ని ప్రదర్శించి ఉత్తమ అవార్డు గెల్చుకున్నారు.

### అబ్బురపరిచే గ్రంథాలయం, ప్రయోగశాల ...

పొందూరు పాఠశాలలో విద్యాబోధనే కాదు గ్రంథాలయం, ప్రయోగశాలలు కూడా ఉన్నత స్థాయిలోనే ఉంటాయి. ఉపాధ్యాయులతోపాటు దాతలు విరివిగా ఇచ్చిన పుస్తకాలతో స్కూలు గ్రంథాలయం నిండుగా కనిపిస్తుంది. పాఠ్యపుస్తకాలే కాకుండా విద్యార్థుల వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేసే అనేక పుస్తకాలు ఇక్కడ ఉన్నాయి. ఖాళీ సమయాల్లో విద్యార్థులు ఇక్కడికి వచ్చి సబ్జెక్టు పుస్తకాలతో పాటు నీతి కథలు, గొప్ప గొప్ప వ్యక్తుల జీవిత చరిత్రలు, సబ్జెక్టు పుస్తకాలు చదువుతారు. ఇందుకోసం ప్రత్యేకంగా సిబ్బంది అంటూ ఎవరూ లేరు. ఉపాధ్యాయులే పలు బాధ్యతలను పంచుకుని గ్రంథాలయాన్ని విజయవంతంగా నిర్వహిస్తున్నారు. విద్యార్థుల ఆసక్తిని గమనించి ఎలాంటి పుస్తకాలు చదవాలో గైడ్ చేస్తుంటారు.

గ్రంథాలయం పక్కనే పూర్తిస్థాయి వసతులతో సైన్స్ ప్రయోగశాల కూడా ఉంది. ఎనిమిది, తొమ్మిది, పదో తరగతి పిల్లలకు క్లాస్‌రూంలో చెప్పే పాఠాలు సులువుగా అర్థమయ్యేందుకు ల్యాబ్‌లో వారిచేత ప్రయోగాలు చేయిస్తుంటారు. కేవలం సాంప్రదాయ పద్ధతుల్లో విద్యాబోధన చేయకుండా, ఆధునిక పరిజ్ఞానాన్ని కూడా అందుబాటులోకి తెచ్చారు. రెండు డిజిటల్ క్లాస్ రూమ్‌లు ఏర్పాటుచేశారు. విద్యార్థులకు కంప్యూటర్ తరగతులు నిర్వహిస్తారు. ఇటీవల బెంగళూరులో జరిగిన జాతీయస్థాయి సైన్స్ ఎగ్జిబిషన్‌లో ఈ పాఠశాల విద్యార్థులు సెల్‌ఫోన్ తయారీలో మైక్రోస్కోప్ (సెల్‌ఫోన్‌నే మైక్రోస్కోప్‌లా ఉపయోగించే పద్ధతి)

### దాతల చేయూత...

ఈ స్కూలు ఉపాధ్యాయుల అంకితభావం, కృషి చూసి ముచ్చటపడి చాలామంది రకరకాలుగా చేయూతనివ్వడానికి ముందుకొస్తున్నారు. సాధారణంగా ప్రభుత్వ పాఠశాల అంటే అసౌకర్యాలతో, అరకొర వసతులతో కనిపిస్తుంది. కాని ఇక్కడ మాత్రం దాతల సాయంతో స్కూలు కళకళలాడిపోతోంది. అదొక ప్రభుత్వ పాఠశాలని వెంటనే నమ్మరు. పూర్వవిద్యార్థులు కూడా తమ పాఠశాల రూపురేఖలు మార్చడానికి ఎన్నో ఏళ్ల నుంచి తమవంతు సాయం చేస్తున్నారు. ప్రస్తుతం విశాఖలోని తూర్పు నావికాదళంలో నేవీ కమాండర్‌గా పనిచేస్తున్న పిట్టా విద్యాసాగర్ అనే పూర్వ విద్యార్థి 3 లక్షల రూపాయలతో అధునాతన డిజిటల్ క్లాస్ రూమ్‌లను సమకూర్చగా, మరో పూర్వ విద్యార్థి పిట్టా గోవిందరావు సోలార్ విద్యుత్‌ను సమకూర్చడానికి ముందుకు వచ్చారు. అదేవిధంగా అనేక సంస్థలు పాఠశాలకు అవసరమైన కుర్చీలు, బెంచీలు, ఇతరత్రా సామాగ్రిని, పుస్తకాలను విరాళంగా అందించాయి. వీరందరి సహకారంతో పొందూరు ప్రభుత్వ పాఠశాల అద్భుత విజయాలను సాధిస్తూ, ప్రభుత్వ పాఠశాలలపై తల్లిదండ్రులకు ఉన్న అపోహలను పటాపంచలు చేస్తూ ముందుకు సాగుతోంది. ఇలాంటి స్కూళ్ల మరెన్నో ఉన్న రోజు ప్రభుత్వ పాఠశాలలపై అపోహలు తొలిగిపోగలవు.

**- చుక్కా అప్పారావు,** ఆంధ్రజ్యోతి, శ్రీకాకుళం

ఫోటోలు: **జోగారావు**





# నా ఇష్టం




నాలుగు నెలలు జైల్లో ఉండి వస్తే మాత్రం
ఇదేం సరదా అండీ? చస్తున్నా !!


ఫేస్‌బుక్ ఫ్రెండ్‌వా? ఎవరికి?
మా మామగారికా? మా వారికా?
మా అబ్బాయికా?


ఇంతకంటే సేఫ్ ప్లేస్ ఎక్కడుంది గురూ?
కానిచ్చేయ్!!
MEN AT WORK


సరే నిన్ను మీ ఇంటికి
తీసుకెళ్లం... ప్లీజ్
వచ్చి బోట్ ఎక్కు!


ఆయన మొహమాటపడుతున్నారు.
ఓ హాఫ్ బాటిల్ విస్కీ ఉంటే అడగమన్నారు.
రేపిచ్చేస్తారట !!

# ఇదోరకం సంప్రదాయం





**20** వేల మంది అతిథులు... 15 వేల కిలోల ఆహారపదార్థాలు... 1888 టేబుల్స్... ఈ హంగామాకు ఇటీవల చైనాలోని ఫోషన్ నగరం వేదికైంది. ఒకే ప్రాంగణంలో ఒకేలాంటి 1888 టేబుల్స్‌ను విహంగ వీక్షణంలో చూసినవారంతా ముక్కున వేలేసుకున్నారు. షుండే జిల్లాలోని షబియన్ గ్రామంలో తిండికి సంబంధించి ఒక సంప్రదాయం ఉంది. వాళ్లంతా భోజనప్రియులు. వారి సంప్రదాయం ప్రకారం గ్రామస్థులంతా యేడాదికి ఒకరోజు ఒకేచోట కలిసి భోజనం చేస్తారు. ఆ సందర్భంగా జరిగిన ఏర్పాట్లే ఇవి. వందలాది వెయిట్రెస్‌లు టేబుళ్ల దగ్గరకు వచ్చి వడ్డిస్తుంటే షబియన్‌వాసులు తమకిష్టమైన పదార్థాలను తృప్తిగా తిని బ్రేవ్‌మన్నారు.

అవీ ఇవీ

# పిల్లలకు 'సూపర్' వినోదం





**పి**ల్లలు స్పైడర్‌మ్యాన్, బ్యాట్‌మ్యాన్, సూపర్‌మ్యాన్ పాత్రలంటే చాలా ఇష్టపడతారు. ఆయా క్యారెక్టర్లు వాటికుండే అతీంద్రియ శక్తులతో భవనాలపైకి ఎగబాకడం, ఆకాశంలోకి దూసుకుపోవడం చేస్తుంటే టీవీల్లో, సినిమాల్లో కళ్లార్పకుండా చూస్తుంటారు. అలాంటి 'సూపర్ క్యారెక్టర్లు కళ్లముందే ప్రత్యక్షమైతే వారి ఆనందానికి అంతుంటుందా? అందుకే అలాంటి అనుభవాన్ని తమ ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న పిల్లలకు ఇవ్వాలనుకున్నారు బ్రెజిల్‌లోని ఒక పిల్లల ఆసుపత్రి నిర్వాహకులు. బాలల దినోత్సవం సందర్భంగా భవనం అద్దాలు తుడిచే కార్మికులకు స్పైడర్‌మ్యాన్, సూపర్‌మ్యాన్ వంటి దుస్తులు వేశారు. వాళ్లు భవనానికి వేలాడుతూ అద్దాలు తుడుస్తూనే, మరోవైపు కిటికీలోంచి పిల్లలకు కనిపిస్తూ వినోదాన్ని అందించారు. ఆసుపత్రిలోని పిల్లలు కళ్లముందుకు వచ్చిన సూపర్ హీరోలను చూసి కేరింతలు కొట్టారు.



# జోకొట్టే యాప్స్!



**రాత్రంతా సుఖంగా నిద్రపోతేనే ఉదయం పక్కమీంచి చిరునవ్వుతో లేవగలం. నిద్ర సరిగా లేకపోతే ఆ రోజంతా అసౌకర్యంగా అనిపిస్తుంది. ఒకనాడు మనల్ని సుఖంగా నిద్రపుచ్చే బాధ్యతను అమ్మలు, పాటలు తీసుకుంటే ఇప్పుడు యాప్స్ తీసుకుంటున్నాయి. అయితే వీటిలో అన్నీ నిద్రపుచ్చే యాప్స్ కావు. కొన్ని నిద్రను ట్రాక్ చేసే యాప్స్.**

## స్లీప్ ట్రాకింగ్ యాప్స్

స్మార్ట్‌ఫోన్‌లోని యాక్సిలోమీటర్ ఆధారంగా ఈ యాప్స్ పనిచేస్తాయి. మనం నిద్రపోతున్నప్పుడు మన కదలికలను రికార్డు చేస్తాయవి. వాటిని బట్టి మనం ఎంత బాగా నిద్రపోతుందీ తెలుస్తుంది. ఇవి మరీ అంత కచ్చితమైన యాప్స్ కాదు కానీ నిద్రను ట్రాక్ చేయడానికి జరిగిన ప్రయత్నాల్లో గొప్ప ముందడుగుగా చెప్పుకోవచ్చు.





**స్లీప్ సైకిల్:** చాలామంది యూజర్స్ దీని గురించి తెలియకపోవడానికి కారణం ఇది ఫ్రీ యాప్ కాకపోవడమే! నిజానికి దీనిని పదిలక్షలమంది వాడుతున్నారు. మన నిద్ర మూడు దశలుగా ఉంటుంది. కనుగుడ్లు చురుగ్గా కదిలే దశ. దీనిని ఇంగ్లీషులో ర్యాపిడ్ ఐ మూమెంట్ (REM ) అంటారు. రెండోది లైట్ స్లీప్. మూడోది ఫుల్ స్లీప్. ఈ యాప్ మన స్లీప్ సైకిల్స్‌ని రికార్డు చేస్తుంది.

**గుడ్ మార్నింగ్:** ఇదొక ఫ్రీ యాప్. స్లీప్ సైకిల్‌లానే పనిచేస్తుంది. మీరు స్మార్ట్‌ఫోన్‌లో అలారం పెట్టుకుని నిద్రకు ఉపక్రమించగానే ఇది పని చేయడం ప్రారంభిస్తుంది. మీ క్వాలిటీ స్లీప్‌ని విజువలైజ్ చేస్తుంది. అంతేకాదు.. మీరు కోరుకునే టైమ్‌కి నిద్ర లేపుతుంది. అదే సమయంలో మీరు లైట్ స్లీప్‌లోకి వెళ్లారా? లేదా? అనేది చెక్ చేసుకుని.. అందుకు తగ్గట్టు అలారం టైమ్‌ని ఎడ్జస్ట్ చేసుకుంటుంది.

**స్లీప్ బెటర్:** యూజర్స్ ఆదరణ పొందిన మరో యాప్ ఇది. ముఖ్యంగా హెల్త్, ఫిట్‌నెస్ విషయంలో పట్టింపుగా ఉండేవారికి అనుకూలమైన యాప్ ఇది. 'రన్‌టాస్టిక్' అనే ఆస్ట్రియన్ మొబైల్ ఫిట్‌నెస్ కంపెనీ ఈ యాప్‌ని రూపొందించింది. ఇది స్లీప్ సైకిల్స్‌ని ట్రాక్ చేయడంతో పాటు ఆల్కహాల్, కెఫీన్ వంటివి తీసుకునే వాళ్ల ఆ వివరాలను ఎంటర్ చేస్తే వాళ్ల సుఖమయ నిద్రకు అవి ఎంతవరకూ భంగం కలిగిస్తున్నాయో కూడా విశ్లేషిస్తుంది. వర్కవుట్, స్ట్రెస్‌ఫుల్ డే.. ఇలా వివిధ కేటగిరీలున్నాయి ఈ యాప్‌లో.

## స్లీప్ ఇంప్రూవింగ్ యాప్స్

స్లీప్ ట్రాకింగ్ యాప్స్ మన నిద్ర నాణ్యతను మాత్రమే పరీక్షిస్తే.. స్లీప్ ఇంప్రూవింగ్ యాప్స్ మరో అడుగు ముందుకేసి మనకు నాణ్యమైన నిద్ర అందే వాతావరణాన్ని క్రియేట్ చేస్తాయి.

**స్లీప్ యాజ్ యాండ్రాయిడ్:** ప్రస్తుతం లభిస్తోన్న ఉత్తమ స్లీప్ ట్రాకింగ్ యాప్స్‌లో ఇదొకటి. ఇది స్మార్ట్‌వాచ్‌తో, సోషల్ మీడియాతో సమన్వయం చేసుకుంటూ పనిచేస్తుంది. నిద్రలో కలవరింతల్ని, గురకను రికార్డు చేస్తుంది. కమ్మటి జోలపాటల్నీ వినిపి స్తుంది. జెట్‌లాగ్‌ని కూడా సమర్థంగా తగ్గిస్తుంది.

**ట్విలైట్:** రాత్రి కాగానే ఈ యాప్ స్మార్ట్‌ఫోన్ స్క్రీన్‌ని 'వార్మప్ మోడ్'లోకి తీసుకెళుతుంది. వార్మప్ మోడ్ వల్ల బ్లూ లైట్ ఎమిషన్ కంట్రోల్ అవుతుంది. లేకపోతే బ్లూ లైట్ మన బయోలాజికల్ క్లాక్‌ని డిస్టర్బ్ చేస్తుంది. ఇదంతా టెక్నికల్ పరిభాష. సాధారణ భాషలో చెప్పాలంటే ట్విలైట్ యాప్ రాత్రి కాగానే ప్రకాశవంతమైన స్మార్ట్‌ఫోన్ స్క్రీన్‌ని డల్ చేసేస్తుంది. దీనివల్ల ఎక్కువ సేపు స్మార్ట్‌ఫోన్‌తో గడపకుండా త్వరగా మంచంపైకి చేరుతాం. ప్రారంభంలో ఈ వార్మప్ స్క్రీన్ కళ్లను ఇబ్బంది పెట్టినా తర్వాత అలవాటైపోతుంది.

**కామ్ :** ఇదొక మెడిటేషన్ యాప్. ఈ యాప్ మెనూలో ప్రొఫైల్, మెడిటేట్, సీన్స్ అనే ఆప్షన్స్ ఉంటాయి. సీన్స్‌లో మనకిష్టమైన ప్రకృతి దృశ్యాన్ని సెలెక్ట్ చేసుకోవచ్చు. దానికి తగిన సంగీతం నేపథ్యంలో వస్తుంది. ఇది మన నిద్ర క్వాలిటీని పెంచడమేగాక, రోజంతా పనిచేసి ఆలోచనలతో వేడెక్కిపోయే బుర్రకు ఉపశమనం కలుగజేస్తుంది. ఆలోచనల్ని దూరం చేసి మెడిటేషన్ చేసేందుకు తగిన వాతావరణాన్ని కల్పిస్తుంది. మెడిటేషన్‌కి సంబంధించి సలహాలు, సూచనలందిస్తుంది.

**స్నోర్‌ల్యాబ్:** పేరుకు తగ్గట్టే ఇది గురకని రికార్డ్ చేసే యాప్. గురక పెట్టే అలవాటు ఉన్నవాళ్లకి ఆ గురక శబ్దం ఎంత ఎక్కువగా ఉందో, నిద్రలో ఏయే సమయాల్లో వస్తుందో విశ్లేషిస్తుంది. అంతేకాదు గురకను తగ్గించుకోవడానికి చిట్కాలను కూడా అందిస్తుందీ యాప్.

**స్లీప్ కాలిక్యులేటర్:** నిద్రలో ఒక్కోసారి హఠాత్తుగా మెలకువ వచ్చేస్తుంది. మళ్లీ నిద్ర పట్టదు. ఆ తర్వాత రోజంతా అసౌకర్యంగా ఉంటుంది. ఈ స్లీప్ కాలిక్యులేటర్ యాప్ ఆ బాధను దూరం చేస్తుంది. బెడ్ టైమ్ ఎన్ని గంటలకు స్టార్ట్ అవ్వాలో సలహా ఇస్తుంది. అలాగే ఎన్ని గంటలకు లేస్తే మంచి నిద్ర మీ సొంతమవుతుందో లెక్కలేసి చెబుతుంది. అందుకే దీన్ని స్లీప్ కాలిక్యులేటర్ అన్నారు.

**రియల్ క్రైమ్ కహానీ - 24**

# నమ్మక ద్రోహం

**ఒడిశా రాజధాని భువనేశ్వర్‌లోని సైనిక పాఠశాల... ఒక్కసారిగా అక్కడ పోలీసుల కలకలం మొదలైంది. సైనిక పాఠశాల పక్కనే ఉన్న హనుమాన్ మందిర్ సమీపంలో ఓ వ్యక్తిని దారుణంగా హత్య చేసి పడేశారు. మృతదేహంపై లోతయిన గాయాల గుర్తులు కన్పిస్తున్నాయి.**

**అ**ప్పుడే సంఘటన స్థలానికి డీసీపీ సత్యవ్రత చేరుకున్నారు.

హత్య జరిగిన ప్రాంతాన్ని, మృతదేహన్ని నిశితంగా పరిశీలించారు.

మృతదేహం సమీపంలో ఒక బ్యాగు ఆయన కంటపడింది.

"ఆ బ్యాగులో ఏముందో చూడండి" అని తన సిబ్బందిని ఆదేశించారు.

పోలీసులు బ్యాగు తెరిచి అందులోని వస్తువులను ఒక్కటొక్కటిగా బయటకు తీశారు.

కొన్ని బట్టలు, విమానం టికెట్, కొన్ని ఐడీ కార్డులు కన్పించాయి.

అందులోని వివరాలు పరిశీలించిన డీసీపీ అక్కడ్నుంచే భువనేశ్వర్ కమిషనర్ ఆర్.పి. శర్మకు ఫోన్ చేశారు.

"సార్... సైనిక పాఠశాల దగ్గర ఒక హత్య జరిగింది... మృతుడు ఆంధ్రప్రదేశ్‌కు చెందినవాడుగా ఉన్నాడు. హత్యా స్థలంలో మాకో బ్యాగు దొరికింది. ఐడీ కార్డులో ఉన్న వివరాల ప్రకారం అతను వైజాగ్ స్టీల్ ప్లాంట్ ఉద్యోగిగా తెలుస్తోంది" అన్నారు.

"ఓకే...ఇంకా ఏమైనా వివరాలు దొరుకుతాయేమో చూడండి... నేను ఇప్పుడే వైజాగ్ కమిషనర్‌తో మాట్లాడతాను" అన్నారు కమిషనర్.

• • •

"ఎస్... మీరు చెప్పింది కరెక్ట్. హతుడు వైజాగ్ స్టీల్‌ప్లాంట్‌లో ఫైనాన్స్ అసిస్టెంట్ జనరల్ మేనేజర్‌గా పనిచేస్తున్న సూర్యప్రసాద్. అతను రెండు రోజుల క్రితం వైజాగ్ నుంచి భువనేశ్వర్ వెళ్లాడని అక్కడి పోలీసులు చెప్పారు. వారు సూర్యప్రసాద్ కుటుంబసభ్యులకు సమాచారం అందించారు. వాళ్లందరూ ఇక్కడికి వస్తున్నారు" అని కమిషనర్ ఫోన్‌లో డీసీపీకి చెప్పారు.

"ఓకే సర్.. ఈ లోపు చుట్టుపక్కల హోటళ్లలో విచారించి హత్యకు ముందు సూర్యప్రసాద్ ఎక్కడ దిగాడో తెలుసుకుంటాం" అని ఫోన్ పెట్టేశారు డీసీపీ సత్యవ్రత.

ఈ హత్యకు సంబంధించిన వార్తలు అక్కడి పేపర్లలో ప్రముఖంగా వచ్చాయి.

ఆంధ్రా పోలీసు అధికారులు కొందరు వెంటనే బయల్దేరి భువనేశ్వర్ వచ్చారు. పోలీసులతో పాటు వచ్చిన సూర్యప్రసాద్ కుమారుడు శేఖర్‌ను డీసీపీ సత్యవ్రత దగ్గరకు తీసుకొచ్చారు.

"ఇంతకీ మీ నాన్న భువనేశ్వర్ ఎప్పుడొచ్చారు? ఏ పని మీద వచ్చారు? ఇక్కడికి వచ్చిన తర్వాత మీతో మాట్లాడారా? మీకు తెలిసిన వివరాలు చెప్పండి" అంటూ ప్రశ్నల వర్షం కురిపించారు.

"సార్... మా నాన్న రెండురోజుల క్రితం భువనేశ్వర్ వచ్చారు. ఇక్కడ హోటల్‌లో దిగిన తర్వాత ఇంటికి ఫోన్ చేశారు. ఆయన నాకు పెళ్లి సంబంధం చూడటానికి వచ్చారు. ఎవరో ఈ సంబంధం గురించి చెబితే ఇక్కడికి వచ్చారు. ఈ లోపు..." అంటూ సూర్యప్రసాద్ కొడుకు శేఖర్ భోరుమన్నాడు.

"సరే... ఎంక్వయిరీలో అన్నీ బయటపడతాయి. అప్పటిదాకా కాస్త ఓపిక పట్టండి" అంటూ శేఖర్‌ను అక్కడి నుంచి పంపించేశారు.

రెండు రోజుల తర్వాత భువనేశ్వర్ కమిషనర్ శర్మ తన ఛాంబర్‌లో సమీక్ష ప్రారంభించారు. డీసీపీ సత్యవ్రతతో పాటు, స్పెషల్ పార్టీ పోలీసులు, వైజాగ్ నుంచి వచ్చిన ఒక బృందం ఈ సమీక్షలో పాల్గొంది.

"ప్రసాద్ కేసులో ముందుగా అతడు దిగిన హోటల్ గుర్తించాలి. ఆయన సెల్‌ఫోన్ కాల్ లిస్టు అనాలిసిస్ చేయాలి. ఆయన హోటల్ నుంచి ఎప్పుడు బయటకు వెళ్లాడు? ఎలా వెళ్లాడు? హోటల్‌లో ఆయనను కలవడానికి ఎవరైనా వచ్చారా ? అనే వివరాలను తెలుసుకోండి..."

"ఓకే సార్..."

"పనిలో పనిగా ఆయన బ్యాంకు లావాదేవీలు కూడా పరిశీలించండి. ఆంధ్రాలో ఆయనకు ఎవరైనా శత్రువులు ఉన్నారా? ఆయనకు ఉద్యోగం కాకుండా ఇతరత్రా వ్యాపకాలేమైనా ఉన్నాయా? ఇలా అన్ని కోణాల్లో దర్యాప్తు జరగాలి" అని దిశానిర్దేశనం చేశారు కమిషనర్ శర్మ.




**"సార్... మా నాన్న రెండురోజుల క్రితం భువనేశ్వర్ వచ్చారు. ఇక్కడ హోటల్‌లో దిగిన తర్వాత ఇంటికి ఫోన్ చేశారు. ఆయన నాకు పెళ్లి సంబంధం చూడటానికి వచ్చారు. ఎవరో ఈ సంబంధం గురించి చెబితే ఇక్కడికి వచ్చారు. ఈ లోపు..." అంటూ సూర్యప్రసాద్ కొడుకు శేఖర్ భోరుమన్నాడు.**

దర్యాప్తులో భాగంగా పోలీసులు పలు బృందాలుగా విడిపోయారు.

ఒక బృందం ప్రసాద్ కాల్ డిటైల్స్ విశ్లేషణలో నిమగ్నమైంది. మరో బృందం ప్రసాద్ ఎక్కడ దిగాడన్న విషయాలను తెలుసుకోవడానికి రంగంలోకి దిగింది. మరోవైపు వైజాగ్ పోలీసుటీమ్ ప్రసాద్ చరిత్రను తవ్వితీయడం ప్రారంభించింది.

ఉద్యోగం కాకుండా ప్రసాద్ రియల్ ఎస్టేట్ వ్యాపారంలో కూడా చురుగ్గా ఉన్నాడని వైజాగ్ పోలీసులకు సమాచారం అందింది. దాంతో రియల్ ఎస్టేట్ వ్యాపారలావాదేవీల్లో భాగంగా హత్య జరిగిందా అనే కోణంలోనూ వైజాగ్ పోలీసులు దర్యాప్తు జరిపారు. వైజాగ్‌లో ప్రసాద్‌కు క్లీన్ చిట్ వచ్చింది. అదే విషయం భువనేశ్వర్ డీసీపీకి తెలిపారు వైజాగ్ పోలీసులు.

హోటళ్లలో, గెస్ట్‌హౌసుల్లో సోదాలు ప్రారంభించిన భువనేశ్వర్ పోలీసులకు ఇన్‌ఫో సిటీ పోలీసుస్టేషన్ నుంచి ఒక కీలక

సమాచారం అందింది. సూర్యప్రసాద్ అక్కడికి దగ్గర్లో ఉన్న 'నమసాయి గెస్ట్‌హౌస్'లో దిగిన విషయాన్ని రూం బాయ్ పోలీసులకు తెలిపాడు.

అదే సమయంలో మరో పోలీసు బృందం సూర్యప్రసాద్ హత్య జరగడానికి ముందు ఆయన రెండు ఏటీఎంల నుంచి లక్ష 27 వేల రూపాయల నగదు డ్రా చేశాడన్న విషయాన్ని గుర్తించింది. దాంతో పాటు సూర్యప్రసాద్ సెల్‌ఫోన్ కాల్ డీటెయిల్స్ పోలీసులకు కొంత కీలక సమాచారాన్ని అందించాయి.

పోలీసు ఉన్నతాధికారులంతా సమావేశమయ్యారు. అప్పటి వరకు జరిగిన దర్యాప్తును క్రోడీకరించారు.

ఒక్కొక్కటిగా కేసు చిక్కుముడులు విడిపోయాయి. కేసు విషయంలో కొంత స్పష్టత వచ్చింది. వెంటనే పోలీసులు యాక్షన్‌లోకి దిగారు.

ఆంధ్రప్రదేశ్ డీజీపీ జేవీ రాముడుతో భువనేశ్వర్ కమిషనర్ శర్మ మాట్లాడారు. డీసీపీ సత్యబ్రత మొత్తం క్లూల ఆధారంగా హంతకుడిని ఇట్టే పట్టేశారు.

• • •

భువనేశ్వర్ కమిషనర్ ఆర్.పి.శర్మ కార్యాలయం విలేఖరులతో కిక్కిరిసిపోయింది.

"ఇదో కోల్డ్ బ్లడెడ్ మర్డర్. నమ్మిన వాళ్లే సూర్యప్రసాద్‌ను కిడ్నాప్ చేసి ఆపై ఆయనను దారుణంగా హత్య చేశారు..." అని కమిషనర్ అనడంతో అక్కడున్నవారంతా విస్తుబోయారు.

"కిడ్నాప్ చేసి హత్య చేశారా? ఎవరు సార్... ఆ హంతకుడు..." వెంటనే ప్రశ్నించాడో రిపోర్టర్.

"ప్రసాద్ పనిచేసే స్టీల్ ప్లాంట్‌లోనే లక్ష్మణ్‌రావు అలియాస్ గురూజీ పనిచేస్తున్నాడు. ఇతనికి వివిధ రాష్ట్రాల్లో శిష్యులున్నారు. నాలుగు మంచిమాటలు చెప్తూ అందరితో కలిసి మెలిసి ఉంటుంటాడీ గురూజీ. కానీ గురూజీ ఒక మేక వన్నె పులి. ప్రసాద్ రియల్ ఎస్టేట్ వ్యాపారంలో బాగా డబ్బు సంపాదిస్తున్నాడనే విషయం గురూజీకి తెలుసు. అందుకే ప్రసాద్‌ను టార్గెట్ చేసి పథకరచన చేశాడు..."

" ఏంటి సార్ ఆ పథకం..." ఉత్సుకత ఆపులేక ప్రశ్నించాడు మరో రిపోర్టర్.

" అక్కడికే వస్తున్నా... ప్రసాద్ కుటుంబనేపథ్యమంతా గురూజీకి తెలుసు. ప్రసాద్ తన కష్టసుఖాలను గురూజీతో చెప్పుకునేవాడు. ప్రసాద్ తన కొడుకు పెళ్లి చేయడానికి ప్రయత్నిస్తున్నాడన్న విషయం తెలుసుకుని భువనేశ్వర్‌లో కోటేశ్వరరావు అనే కోటీశ్వరుడికి ఒక కూతురు ఉందని, ఆయనతో సంబంధం కలుపుకోమని చెప్పాడు. ఆ కోటేశ్వరరావు తన శిష్యుడని కూడా చెప్పాడు గురూజీ. ఆ తర్వాత తాను కోటేశ్వరరావుకు ఫోన్ చేశానని, అమ్మాయిని చూసి రమ్మని ప్రసాద్‌ను భువనేశ్వర్ పంపించాడు. మంచి సంబంధమని గురూజీ చెప్పడంతో ప్రసాద్ భువనేశ్వర్‌కు వచ్చాడు. ఆయన విమానం దిగి బయటకు రాగానే అక్కడ రెడీగా ఉన్న గురూజీ శిష్యుడు శ్రీనివాస్ పండా 'తనను గురూజీ పంపించార'ని చెప్పి కారులో ఎక్కించుకున్నాడు. భువనేశ్వర్ ఇన్ఫో సిటీ పోలీసుస్టేషన్ పరిధిలోని 'నమసాయి గెస్ట్‌హౌస్' కు సూర్యప్రసాద్‌ను తీసుకువెళ్లాడు. సూర్యప్రసాద్ గదిలోకి వెళ్లిన కొద్దిసేపటికే గెస్ట్‌హౌస్ ఓనర్ మనోజ్‌తో పాటు మరో ముగ్గురు అక్కడికి వచ్చి ఒక్కసారిగా ఆయన మీద పడి కాళ్లుచేతులు తాళ్లతో కట్టేశారు. ఏం జరుగుతుందో అర్థంకాక సూర్యప్రసాద్ కేకలు పెట్టారు.

"నిన్ను కిడ్నాప్ చేశాం... మాకు ఐదు కోట్ల రూపాయలిస్తేనే వదిలేస్తాం" అని అసలు సంగతి చల్లగా చెప్పారు.

బిత్తరపోయిన సూర్యప్రసాద్ తాను అంత డబ్బు ఇవ్వలేనని, తన వద్ద అంత డబ్బు లేదని, తనను వదిలేయమని ప్రాధేయపడ్డాడు. మనోజ్ గ్యాంగ్ విచక్షణారహితంగా ప్రసాద్‌ను కొట్టారు. దాంతో ఆయన తన వద్ద ఉన్న డెబిట్ కార్డులతో బ్యాంకులో ఎంత డబ్బు ఉంటే అంత ఇస్తానన్నాడు. వెంటనే ప్రసాద్‌ను ఒక కారులో కూర్చోపెట్టుకుని రెండు ఏటీఎంల వద్దకు వెళ్లి లక్షా 27వేల రూపాయలను డ్రా చేయించారు. ప్రసాద్ ఉంగరాలను, మెడలోని బంగారు గొలుసును కూడా లాక్కుని చితకబాదడంతో ఆయన అపస్మారక స్థితిలోకి వెళ్లిపోయారు. దాంతో ప్రసాద్ చనిపోయాడని భావించి హనుమాన్ మందిర్ పక్కన పొదల్లో పడేసి వెళ్లిపోయారు. బాగా గాయపడి చాలాసేపు ఆ పొదల్లోనే ఉండటంతో చికిత్స అందక ప్రసాద్ మృతిచెందాడు. కాజేసిన డబ్బును గురూజీతో పాటు అందరూ పంచుకున్నారు.

"ఇంతకీ హంతకులను ఎలా గుర్తించారు?" ఒక రిపోర్టర్ ప్రశ్నించాడు.

" ఏటీఎంలోని సీసీ కెమెరాలు మనోజ్ గ్యాంగ్‌ను పట్టిస్తే, సూర్యప్రసాద్ ఫోన్‌తో పాటు మనోజ్ సెల్‌ఫోన్ కాల్‌లిస్టు గురూజీని పట్టించాయి. ఐదు కోట్లను డిమాండ్ చేసిన హంతకులు చివరికి ఏటీఎంలలో డ్రా చేసిన లక్షా 27 వేల రూపాయల ఆధారంగా పట్టుబడ్డారు. గ్యాంగులోని ఐదుగుర్నీ కూడా అరెస్టు చేశాం. గురూజీ అసలు స్వరూపం తెలియక ఆయన్ని నమ్మి ప్రసాద్ తన ప్రాణం మీదకు తెచ్చుకున్నాడు. ఇలాంటి నేరస్థులు మన చుట్టుపక్కల చాలామంది ఉంటారు జాగ్రత్త" అని విలేఖరుల సమావేశాన్ని ముగించారు భువనేశ్వర్ కమిషనర్ ఆర్.పి.శర్మ.

**మనోజ్ గ్యాంగ్ విచక్షణారహితంగా ప్రసాద్‌ను కొట్టారు. దాంతో ఆయన తన వద్ద ఉన్న డెబిట్ కార్డులతో బ్యాంకులో ఎంత డబ్బు ఉంటే అంత ఇస్తానన్నాడు. వెంటనే ప్రసాద్‌ను ఒక కారులో కూర్చోపెట్టుకుని రెండు ఏటీఎంల వద్దకు వెళ్లి లక్షా 27వేల రూపాయలను డ్రా చేయించారు. ప్రసాద్ ఉంగరాలను, మెడలోని బంగారు గొలుసును కూడా లాక్కుని చితకబాదడంతో ఆయన అపస్మారక స్థితిలోకి వెళ్లిపోయాడు.**

**- వేముల సత్యనారాయణ,**
**99854 88800**

# హోమ్ గార్డెనింగ్ గాడ్జెట్స్..

## ఎడ్విన్ గార్డెన్ సెన్సార్
### (Edyn Garden Sensor)



మొక్కలను నాటడం ఎంత ముఖ్యమో.. వాటిని జాగ్రత్తగా కాపాడుకోవడం అంతకంటే ముఖ్యం. చాలాసార్లు పని ఒత్తిడిలో పడి నాటిన మొక్కల గురించి మరిచిపోతుంటాం. లేదా మొక్కలకు ఎప్పుడు నీళ్లు పెట్టాలో సరిగ్గా తెలియక ఎప్పుడు ఖాళీ దొరికితే అప్పుడు నీళ్లు పడతారు చాలామంది. రెండూ మొక్కలకు నష్టదాయకమే. ఈ ఇబ్బందులు లేకుండా చేస్తుంది 'ఎడిన్ గార్డెన్ సెన్సర్'. గాలిలోని తేమ ఆధారంగా మొక్కకు ఏ సమయంలో నీళ్ల అవసరమో తెలియజేస్తుంది ఈ సెన్సర్. అంతేకాదు భూసారాన్ని, లవణాల సాంద్రతను కూడా కచ్చితంగా లెక్కకడుతుంది ఈ గాడ్జెట్. దాని ప్రకారం కావలసిన పోషకాల వివరాలను, అవసరమైనప్పుడు నీటిని విడుదల చేయమనే సమాచారాన్ని 'మొబైల్ యాప్' ద్వారా తెలుపుతుంది.

ఇంటెక్

## బోటనీకాల్స్ (Botanicalls)

మొక్కలను పెంచడం చాలామందికి ఓ వ్యాపకం. మనుషులతో కంటే మొక్కలతో ఎక్కువసేపు గడిపేందుకు, వాటితో తమ భావాలను పంచుకునేందుకు ఆసక్తి చూపేవారు కూడా ఉంటారు. అంత ఇష్టంగా మనం పెంచే మొక్కలు మనతో మాట్లాడితే.. ఎలా ఉంటుంది? అలాంటి అనుభూతిని కలిగిస్తుంది ఈ 'బోటనీకాల్స్'. ఈ గాడ్జెట్‌ను మొక్క మొదట్లో నాటితే చాలు.. మొక్కకు సంబంధించిన సమస్త సమాచారాన్ని మన ట్విట్టర్ అకౌంట్‌కు పంపుతుంది. ట్విట్టర్ ద్వారా మొబైల్‌కు మెసేజ్ వస్తుంది. చూసేందుకు 'ఎలక్ట్రానిక్ ఆకు'లా ఉండే ఈ గాడ్జెట్ మొక్క నాటి ఎంతకాలం అయింది, భూమిలో ఉన్న తేమ స్థాయి ఎంత? వంటి సమాచారాన్ని మొక్క స్వయంగా మాట్లాడుతు న్నట్టుగా మెసేజ్ రూపంలో మొబైల్‌కు పంపుతుంది.



ఈ వస్తువులను వాటి పేరుతో నెట్‌లో సెర్చ్ చేసి, వివిధ ఆన్‌లైన్ సంస్థల ద్వారా కొనుగోలు చేయవచ్చు.

## గార్డెన్ డిఫెన్స్ ఎలక్ట్రానిక్ ఓల్
### (Garden Defense Electronic Owl)



పక్షులు వచ్చి పంటను పాడుచేయకుండా పొలాలలో దిష్టిబొమ్మను పెడతారు రైతులు. అలా ఇంటి ఆవరణలో ఉండే మొక్కలకు కాపలా కాసేందుకు తయారుచేసిందే ఈ 'గార్డెన్ డిఫెన్స్ ఎలక్ట్రానిక్ ఔల్'. అటూఇటూ నడుస్తూ మొక్కలను చిన్నచిన్న పక్షుల బారి నుంచి రక్షిస్తుంది ఇది. అంతేకాదు కీటకాలు కనిపిస్తే వాటిపైన దాడిచేసి చంపేస్తుంది కూడా. చూడడానికి అచ్చం గుడ్లగూబలా ఉండే ఈ ఎలక్ట్రానిక్ ఔల్ బ్యాటరీలతో నడుస్తుంది. ఇది కేవలం గార్డెనింగ్ గాడ్జెట్‌లానే కాకుండా ఒక బొమ్మలా గార్డెన్‌లో అందంగా అమరిపోతుంది కూడా.



## క్లిక్ అండ్ గ్రో స్మార్ట్ పాట్స్ (click and grow smart pots)

ఈ 'క్లిక్ అండ్ గ్రో స్మార్ట్ పాట్స్'... మామూలు కుండీలకు ఆధునిక సాంకేతికను జోడించి తయారుచేసిన పాట్స్. చూసేందుకు ఏ మాత్రం కుండీల్లా కనిపించకుండా ఇంట్లో అందంగా అమరిపోతాయి. ఈ స్మార్ట్ పాట్స్‌లో ఉండే మరో ప్రత్యేకత 'స్మార్ట్ సాయిల్' (ఖిర్ముట్ట ఖోజీజూ). అందులో మొక్కకు కావలసిన అన్ని పోషకాలు కావలసిన మోతాదులో ఉంటాయి. అంతేకాకుండా మామూలు మట్టిలో పెరిగే మొక్కల కంటే ఈ స్మార్ట్ పాట్స్‌లో పెరిగే మొక్కలు 95 శాతం తక్కువ నీటిని గ్రహిస్తాయి. ఇంట్లోనే కూరగాయలు పండించుకోవాలనుకునేవారికి ఈ 'క్లిక్ అండ్ గ్రో స్మార్ట్ పాట్స్' బాగా ఉపయోగపడతాయి.



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## రోగ నివారణ సులభం - రోగనిరోధక వ్యవస్థ పటిష్టం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



ప్రస్తుత చల్లని వాతావరణంలో చాలామంది అనేక వ్యాధుల బారిన పడుతుంటారు. వాతావరణానికి తగ్గట్లుగా ఆహారనియమాలు పాటించటంతో పాటు, జీవన విధానంలో మార్పులు చేసుకున్నప్పటికీ అకస్మాత్తుగా ఏర్పడే వాతావరణ మార్పులకు కొన్ని సార్లు శరీరం సిద్ధంగా లేకపోవడం మరియు ఆ సమయంలోనే పరాన్నజీవులు శరీరంపై దాడి చేయడం వలన శరీర రోగనిరోధక శక్తి తగ్గిపోవడం - తద్వారా వ్యాధులకు గురికావడం జరుగుతుంది. అధిక మానసిక ఒత్తిడి వలన కూడా శరీర రోగనిరోధక వ్యవస్థ అసమతుల్యతలకు గురి అవుతుంది. ముఖ్యంగా మనం జబ్బు పడుతున్నామంటే మన శరీర రోగనిరోధక శక్తి తగ్గిపోవడమే అందుకు ప్రధాన కారణం. కాబట్టి ఈ రోగనిరోధక వ్యవస్థ (immune system) ఏ విధంగా పని చేస్తుంది? హోమియో వైద్యవిధానం ద్వారా ఇది ఏ విధంగా బూస్ట్ చేయబడుతుంది? అనే విషయాలను ఇప్పుడు తెలుసుకుందాం.

సాధారణంగా రోగనిరోధక వ్యవస్థ అనేది - మన శరీరంలోని వివిధ అవయవాలూ, వాటి ప్రక్రియల సమ్మేళనంగా ఉంటూ - మనకు వ్యాధులను కలిగించే బ్యాక్టీరియా, వైరస్ మరియు ఫంగస్ మొదలైన వాటి నుండి శరీరానికి రక్షణ కల్పించే ఒక కీలకమైన వ్యవస్థ. ఇది కొంతవరకు వారసత్వ రీత్యా ఏర్పడితే, మరికొంతవరకు మనం అవలంబించే జీవన విధానాల ద్వారా ఏర్పడటం జరుగుతుంది. ఈ రోగనిరోధక వ్యవస్థ సహజంగా మన శరీర కణజాలమంతటా వ్యాపించి ఉంటుంది. ఉదా: చర్మం క్రింది భాగం, బోన్ మ్యారో, లింఫ్ గ్రంథులు, రక్తం మరియు ప్లీహం మొదలైనవన్నీ రోగనిరోధక వ్యవస్థ ప్రక్రియలో ప్రధాన భూమిక వహిస్తాయి. సాధారణంగా మన శరీరంలో చాలా రకాల బ్యాక్టీరియాలు, వైరస్‌లు మొదలైనవి మనతోపాటు సహజీవనం సాగిస్తాయి. మనలోని రోగనిరోధక వ్యవస్థ సమతుల్యంగా ఉన్నంతవరకు వీటి ప్రభావం శరీరంపై ఉండదు. పైగా ఎప్పటికప్పుడు వీటి నుండి ఏర్పడే టాక్సిన్స్‌ను బయటకు పంపివేస్తుంది. ఏ కారణం చేతనైనా ఈ రోగనిరోధక వ్యవస్థ అసమతుల్యతకు గురి అయితే అవి (బ్యాక్టీరియా, వైరస్ మొ॥వి) మన శరీరంపై దాడి చేసి, వ్యాధులను కలుగజేస్తాయి. ఈ క్రమంలో రోగనిరోధక వ్యవస్థ మన ఆరోగ్యాన్ని తనంతట తానుగా (స్వీయ రీతిన) సరిచేసుకునే ప్రక్రియ కారణంగా శరీరంలో ఇన్‌ఫ్లమేషన్ ఏర్పడుతుందనే (ఉదా: జలుబు, టాన్సిలైటిస్ మొ॥వి.) సంగతి చాలామందికి తెలిసిన విషయమే.




సరైన పోషకాహారం ఆరోగ్యానికి చాలా అవసరం, అలాగే నిద్ర, విశ్రాంతి, ఉద్యోగం, వ్యాయామం మరియు నీరు మొదలైనవి మన ఆరోగ్యం నిలిపి ఉంచటంలో కీలక పాత్ర పోషిస్తాయి. కానీ ఇవన్నీ మన శరీరానికి అవసరమైన మోతాదులో అందినప్పుడే ఆరోగ్యం సమతుల్యంగా ఉంటుంది. ఉదా: ఎక్కువ మోతాదులో ఆహారం తీసుకోవడం వలన స్థూలకాయం మరియు తక్కువ మోతాదులో తీసుకుంటే పోషకాహార లోపం ఏర్పడుతుంది. అదేవిధంగా రోగనిరోధక శక్తి శరీరంలో ఉండవలసిన దానికంటే ఎక్కువ ఉత్తేజితంగా ఉన్నట్లయితే అలాంటి పరిస్థితి కొన్ని రకాల ఆటో ఇమ్యూన్ వ్యాధులకు (ఉదా: రుమటాయిడ్ ఆర్థరైటిస్) దారి తీస్తుంది. మనకు ఈ వ్యాధులు తలెత్తినప్పుడు మనలోని రోగనిరోధక వ్యవస్థ తన సొంత కణాలపైనే దాడి చేయడం జరుగుతుంది. కొన్ని సందర్భాలలో రోగనిరోధక శక్తి శరీరంలో తక్కువగా ఉన్నట్లయితే జలుబు వంటి సమస్యలు ఏర్పడతాయి. ఈ తరహా ఇబ్బందులు కొన్నిసార్లు తీవ్రమైన ఆరోగ్య సమస్యలకు దారి తీస్తాయి.

ఇతర వైద్య విధానాలలో కేవలం వ్యాధి లక్షణాలను మాత్రమే తగ్గించడం వలన వ్యాధి పూర్తిగా అణిచివేయబడి, వ్యాధి మూలాలు మాత్రం శరీరంలో అలాగే ఉండిపోవటం జరుగుతుంది. తద్వారా వ్యాధి మళ్ళీ తిరగబెట్టేదిగా ఉంటుంది. అది శరీరం లోపల నుండి పూర్తిగా తొలగించబడాలంటే మనం ప్రకృతి సిద్ధమైన వైద్య విధానాన్ని పాటించడం అవసరం. అలాంటి వాటిలో హోమియోపతి ఒకటి. ఇది ప్రకృతి సిద్ధమైన 'law of similars' అనే సిద్ధాంతంపై పనిచేస్తుంది. వ్యాధిని నివారించే ఔషధాలు ఆరోగ్యంగా ఉన్న వ్యక్తులపై ఉపయోగించినప్పుడు, అవి ఆ వ్యాధి లక్షణాలను కనబరుస్తాయి. దీనినే 'law of similars' అని అంటారు. ఈ ఔషధాలను తక్కువ మోతాదులో ఆల్కహాల్ ద్రావకంలో గానీ లేదా నీటిలో గానీ విలీనపరచి ఎక్కువసార్లు కుదించడం ద్వారా దాని యొక్క ప్రాణాధార శక్తి (vital force) పెరిగి, అవి అసమతుల్యతలకు గురి కాబడిన రోగనిరోధక శక్తికి బలం చేకూర్చడం జరుగుతుంది. ఇలా బలాన్ని పొందిన రోగనిరోధక వ్యవస్థ తనంతట తానుగా వ్యాధిని సమూలంగా నిర్మూలించగలుగుతుంది. తద్వారా ఆ వ్యాధి మళ్ళీ తిరగబెట్టకుండా మరియు ఎలాంటి దుష్ఫలితాలు లేకుండా పూర్తిగా నయం కావటం జరుగుతుంది.

హోమియోపతి విధానంలో వ్యాధికి మాత్రమే కాకుండా - వ్యాధితో బాధపడుతున్న వ్యక్తికి సరైన చికిత్స అందించడం జరుగుతుంది. ఇది కేవలం ఆ రోగిని వ్యక్తిగతీకరించడం (law of individualisation) వలన మాత్రమే సాధ్యమవుతుంది. ఎలా అంటే ప్రతి వ్యక్తికీ ఒక ప్రత్యేకత ఉంటుంది. ఏ ఇద్దరు వ్యక్తులూ ఒకే విధంగా ప్రవర్తించలేరు. అలాగే అనారోగ్య పరిస్థితులలో కూడా ఒక్కో వ్యక్తి కొన్ని ప్రత్యేక లక్షణాలను మానసికంగా గానీ, శారీరకంగా గానీ కనబరచటం జరుగుతుంది. ఇలాంటి ప్రత్యేక లక్షణాలను గుర్తించడాన్నే 'law of individualisation' అంటారు. దీని ద్వారా వ్యాధి మూలాలపై సమగ్ర అధ్యయనం జరిపి, ఆ వ్యక్తికి సరిపడిన ఔషధం (constitutional remedy) అందించడం ద్వారా రోగనిరోధక వ్యవస్థ బలపడి వ్యాధి సంపూర్ణంగా నయం కాబడుతుంది. ఇతర వైద్య వ్యవస్థల మాదిరిగా కాకుండా హోమియోపతి ప్రక్రియలో జన్యుపరమైన వ్యాధులను కూడా నయం చేయడం జరుగుతుంది.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** కేవలం హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే అందించబడే అధునాతనమైన జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ చికిత్సా విధానం ద్వారా అనుభవజ్ఞులైన వైద్య బృందంచే అనారోగ్యానికి గురి కాబడిన వ్యక్తి సమస్యపై పూర్తి స్థాయి అధ్యయనం జరిపి, తద్వారా వ్యాధి మూలాలను గుర్తించిన అనంతరం అందించబడే చికిత్స ద్వారా డయాబెటిస్, కీళ్ళ సమస్యలు, హార్మోన్ సమస్యలు, సంతానలేమి సమస్యలు, థైరాయిడ్ మరియు చర్మసమస్యలు మొదలైన వ్యాధులన్నింటినీ సమూలంగా మరియు ఇక మళ్ళీ జీవితంలో మరొకసారి తిరగబెట్టని విధంగా సంపూర్ణంగా నయం చేయటం జరుగుతుంది.

## నా బొమ్మ




**ఎస్.విష్ణుప్రియ**
**10వ తరగతి**
కాంఫర్డ్ ఇంగ్లీష్
హైస్కూల్, చిత్తూర్.




## మీకు తెలుసా!

1 హైనా ఏడవడాన్ని ఇంగ్లీషులో లాఫ్ అంటారు.

1 ముక్కు మూసుకుని కూనిరాగం తీయలేం.

1 సముద్రంలో ఉన్న తొంభైశాతం వ్యర్థాలు ప్లాస్టిక్‌వే!

1 అవసరమైనప్పుడు గుర్రం కంటే ఆస్ట్రిచ్ పక్షే వేగంగా పరిగెత్తగలదు.

1 కత్తెర కనుగొన్నది లియోనార్డొ డావిన్సీ

1 భూమిపై లభించే స్వచ్ఛమైన నీటిలో 75శాతం హిమనదాల్లోనే (గ్లేషియర్స్) ఉంది.

1 భూమిపై అత్యధికంగా సాగుచేసే కూరగాయ బంగాళాదుంప.



## బేతాళ ప్రశ్న - 7

శివ ఒక అపార్ట్‌మెంట్ పదో అంతస్థులో ఉంటున్నాడు. ప్రతిరోజూ ఉదయాన్నే ఆఫీసుకు వెళ్లేటప్పుడు మెట్లు దిగకుండా లిఫ్ట్‌లో కిందకి వస్తాడు. సాయంత్రం ఆఫీసు నుంచి వచ్చాక మాత్రం లిఫ్ట్ ఎక్కి ఏడో అంతస్తులో దిగి మిగిలిన మూడు అంతస్థులు మెట్లు ఎక్కి పైకి వెళతాడు. శివ అలా చేయడానికి కారణం ఏమై ఉంటుంది?

**సమాధానం వచ్చేవారం!**

**మీ దగ్గర ఇలాంటి మెదడుకు మేతవేసే ప్రశ్నలు, భేతాళ ప్రశ్నలు ఉంటే సమాధానంతో పాటు మా ఈమెయిల్ kerintha.aj@gmail.com కు పంపించగలరు**



**గతవారం సమాధానం :** ప్రకాశ్ ఆర్డర్‌గా, టైంగా చెప్పిన ఒకే మాట- ఒక్క 'టీ'

**బేతాళ ప్రశ్న- 5 కు సరైన సమాధానాలు పంపిన మొదటి ముగ్గురు:**
ఎం. తిరుపతిరావ్, సోంపేట
వెజర్ల అంజిబాబు, ఈమెయిల్
హరీష్ కృష్ణ, ఈమెయిల్




## చెవుల ఎలుక

**చె**వుల పిల్లి తెలుసు గానీ ఈ చెవుల ఎలుక ఎక్కడిదీ అనుకుంటున్నారా? చూడ్డానికి భలే గమ్మత్తుగా ఉన్న ఈ ఎలుక చైనా, మంగోలియా ఎడారుల్లో నివసించే ఓ బుల్లి క్షీరదం. దీని శరీరం కంటే చెవులే పెద్దవి. ఇది కంగారూలా గెంతుతూ ముందుకెళుతుంది. కేవలం రాత్రివేళల్లో మాత్రమే సంచరించే దీని అసలు పేరు లాంగ్ ఇయర్డ్ జెర్బోవా (ఝటౌఛ్చొ). ప్రస్తుతం ఇవి అంతరించిపోయే దశలో ఉన్నాయట పాపం!



## భారీ బాల్‌పాయింట్



**గి**న్నిస్ రికార్డు నెలకొల్పిన అతి పెద్ద బాల్ పాయింట్ పెన్ మన దగ్గరే ఉందని మీకు తెలుసా? నిజామాబాద్‌కు చెందిన ఎమ్.ఎస్. ఆచార్య ఈ కలం రూపశిల్పి. ఆయన ఆలోచనలకు, డిజైన్‌కు ఇద్దరు కళాకారులు 56 రోజుల పాటు శ్రమించి ఓ రూపమిచ్చారు. ఇత్తడితో తయారు చేసిన ఈ భారీ కలం పొడవు దాదాపు పద్దెనిమిది అడుగులు. బరువు దాదాపు 37 కిలోలు. ఈ కలంపై భారతీయ నృత్యరీతులను చెక్కారు. ఇంత భారీగా ఉంది ఇదేం రాస్తుంది అనుకుంటారేమో.. సాధారణ బాల్ పాయింట్ పెన్నులానే రాస్తుంది.




## దారి కనుక్కోండి




## అలనాటి అపార్ట్‌మెంట్

**ఏ**డో శతాబ్దంలో టర్కీలోని ఎర్సియస్, హసన్ అనే రెండు అగ్నిపర్వతాల మధ్య నివసించే ప్రజలు ఆ అగ్ని పర్వతాల నుంచి వచ్చిన బూడిదతోనే ఒకదానిపై ఒకటిగా ఇళ్లు కట్టుకున్నారు. అదెలా అంటే తమ ప్రాంతంలో పెద్దఎత్తున పోగుపడిన బూడిద కాలక్రమంలో రాయిగా మారితే దానినే తొలచి అంతస్తులుగా మార్పు చేశారు. అలనాటి ఈ అపార్ట్‌మెంట్ల లో ఇళ్లు, చర్చి, సాధువులకు ప్రత్యేకంగా గదులు నిర్మించారు. ఈనాటి అపార్టమెంట్ల సంస్కృతికి ఆద్యులుగా నిలిచారు.








# వార్తాపత్రికల మ్యూజియం

**వా**ర్తలకి కూడా ఉంది ఒక మ్యూజియం... దాని పేరు 'న్యూజియం'. అమెరికాలోని వాషింగ్టన్ డి.సి.లో ఉంది ఇది. దూరం నుంచి చూస్తుంటేనే ఆ భవనానికేదో ప్రత్యేకత ఉన్నట్టు కనిపిస్తుంది. అమెరికా రాజ్యాంగం హామీ ఇస్తున్న స్వేచ్ఛల గురించి వివరించే ఓ నాలుగంతస్తుల పొడవైన శిలాఫలకం ఈ 'న్యూజియం'కు పెట్టని ఆభరణం. న్యూజియం భవంతిలోకి అడుగుపెట్టడానికి ముందే ఉత్తేజపూరితమైన ఓ పత్రికా ప్రపంచం ఆవిష్కృతమవుతుంది. ఆ రోజు వెలువడిన పత్రికల మొదటి పేజీలు అక్కడ దర్శనమిస్తాయి. లోపల ఒక ప్రత్యేక విభాగంలో ఆ రోజు ప్రపంచ వ్యాప్తంగా వెలువడిన పత్రికల డిజిటల్ ప్రతుల మొదటి పేజీలన్నిటినీ కూడా చూడొచ్చు. ఖండాలవారీగా, దేశాల వారీగా లేదా అక్షర క్రమంలోనూ ఆ పత్రికలను చూడవచ్చు.

గూటెన్‌బర్గ్ ముద్రణా యంత్రాన్ని కనిపెట్టిననాటి నుంచి పత్రికా రంగం ఎలా వికసించిందీ ఈ 'న్యూజియం'లో చూస్తాం. మరీ ముఖ్యంగా గత ఐదు శతాబ్దాలలో పత్రికా రంగంలో చోటుచేసుకుంటూ వస్తున్న సాంకేతిక పరిణామాలకు ఈ 'న్యూజియం' ఒక పెద్ద భాండాగారం. ఆధునిక ప్రజాస్వామ్యం ప్రజల ముంగిటకు వచ్చే క్రమంలో దశలవారీగా పత్రికా రంగం చేసిన కృషి ఇక్కడ కనిపిస్తుంది. వార్తా సేకరణలో, సమాచార ప్రసారంలో వచ్చిన మార్పులను వివరించే ప్రత్యేక మినీ థియేటర్లు ఓ డజను వరకూ ఇక్కడ ఉన్నాయి. గతంలో వార్తల సేకరణ ఎలా ఉండేది, ఇప్పుడు ఎలా ఉంది, భవిష్యత్తులో ఎలా ఉండబోతున్నదీ కూడా ఇక్కడ మనకు ప్రత్యేకంగా గైడెడ్ టూర్‌లలో చూపిస్తారు. అంతే కాదు, ప్రపంచ రాజకీయ చిత్రపటంలో చోటుచేసుకున్న ఎన్నో కీలకమైన పరిణామాలకు సంబంధించిన వస్తువులు కూడా ఇక్కడ ఉన్నాయి.

మొదటి ప్రపంచ యుద్ధం, రెండవ ప్రపంచ యుద్ధం, బెర్లిన్ పతనం, సోవియట్ యూనియన్ విచ్ఛిన్నం, సెప్టెంబర్ 11 ఘటన వంటి పరిణామాలన్నిటినీ ఇక్కడ చూడొచ్చు. జర్నలిజం అంటే ఏమిటి అనే ప్రశ్నకి అందరూ చెప్పే సమాధానం ఒక్కటే... కుక్క మనిషిని కరిస్తే వార్త కాదు, మనిషి కుక్కని కరిస్తే అది వార్త అని! కాని ఈ మాట చెప్పిందెవరో మనకి తెలియదు. 'ది సన్' పత్రిక సిటీ ఎడిటర్ జాన్ బి బొగార్ట్ ఈ మాట అన్నాడనేది ఇక్కడ రికార్డయి ఉంది.  జర్నలిజాన్ని సింప్లిఫై చేసినందుకు ఆయనను మనమందరం గుర్తు పెట్టుకోవలసిందే. ఈ ఉటంకింపు ఒక ఫలకంగా ఈ 'న్యూజియం'లో కనిపిస్తుంది. సమాచారాన్ని ఎప్పటికప్పుడు ప్రజలకు చేరవేసే సాధనాలని ఎక్కడో, ఎవరో నిరంతరం అణచివేయాలనే చూస్తుంటారు, అటువంటి యత్నాలను తిప్పికొట్టడం ఒక్క పాత్రికేయుల పనే కాదు, ప్రజాస్వామ్య ప్రియులది కూడా అన్న ఫలకం కూడా ఇక్కడ కనిపిస్తుంది.

సామాజిక మాధ్యమాల (సోషల్ మీడియా) పరిణామంపై కూడా ఇక్కడ ప్రత్యేకమైన విభాగాలు కనిపిస్తాయి. మొదట సమాచారం అనేది ముద్రణా యంత్రాల ద్వారా సమాజానికి బట్వాడా అయితే ఆ తర్వాత రేడియో, టెలివిజన్, ఇప్పుడు ఫేస్‌బుక్, ట్విటర్, ఇన్‌స్టాగ్రామ్, ఇంకా ఎన్నెన్నో మాధ్యమాల ద్వారా ప్రసారమవుతోంది. భవిష్యత్తులో వాటి పాత్ర అసమానంగా ఉండబోతున్నదని ఈ 'న్యూజియం' చూసినవారికి ఇట్టే అర్థమైపోతుంది.

మనిషి చంద్రునిపై కాలు మోపిన చరిత్రాత్మకమైన రోజును అమెరికన్ పత్రికలు ఎలా రికార్డు చేసిందీ, జాన్ ఎఫ్ కెన్నెడీ హత్య జరిగిన రోజు ఆ వార్త గురించి పత్రికలు ఎలా కవర్ చేసిందీ అక్కడ చూడడమే కాదు, కావాలంటే ఆ ప్రతులను కొనుగోలు కూడా చేయవచ్చు. అప్పటి పత్రికలను ఇప్పుడు కొనుక్కోవడం అంటే టైమ్ మిషన్‌లో ప్రయాణించడం లాంటిదనిపిస్తుంది.



## రెడీమేడ్ యాంకర్లు!

విజ్ఞానంతోపాటు వినోదానికి కూడా ఈ 'న్యూజియం'లో బోలెడంత అవకాశం ఉంది. కాబోయే యాంకర్లకు అన్నట్టుగా సుప్రసిద్ధ వార్తా సంస్థ సిఎన్ఎన్ ఈ 'న్యూజియం'లో ఒక పెద్ద ఆడియో విజువల్ ఔత్సాహిక కేంద్రాన్నే నెలకొల్పింది. టెలివిజన్ యాంకర్ కావాలనుకునేవారు ఇక్కడ తమ అదృష్టాన్ని పరీక్షించుకోవచ్చు. యాంకర్ స్థానంలో కూర్చుని ముందుగా ఏదైనా రాసుకుని చదవవచ్చు. లేదంటే టెలిప్రాంప్టర్లలో ప్రసారమయ్యే వార్తలనైనా చదవవచ్చు. మీరు ఎంత బాగా చదివితే అన్ని ప్రశంసలు. సొంతంగా ఏదైనా రికార్డు కూడా చేయవచ్చు. వార్తాంశాలేగాదు, వినోద సంబంధమైనవైనా, వాతావరణ హెచ్చరికలలైనా సరే ఇక్కడ రికార్డు చేయవచ్చు. అలా రికార్డు చేసిన వాటిని అప్పటికప్పుడు చూసుకునే వెసులుబాటు కూడా 'న్యూజియం'లో ఉంది.

### అమర జర్నలిస్టులకు నివాళి

యుద్ధ రంగం నుంచి రిపోర్టు చేస్తూ ఎందరో జర్నలిస్టులు మరణిస్తుంటారు. కొందరు మాఫియా కుట్రలకు బలైపోతుంటారు. మరి కొందరు రాజ్యానికి దాసోహం అననందుకు అసువులు బాస్తుంటారు. అటువంటి వారికి ప్రతి సంవత్సరం 'న్యూజియం' నివాళి అర్పిస్తుంది. వారి కుటుంబాలను ప్రత్యేకంగా ఆహ్వానించి ఆయా జర్నలిస్టుల పేర్లను ఆత్మబలిదానం చేసినవారి జాబితాలో కుటుంబ సభ్యుల సాక్షిగా చేరుస్తుంది. ఏ జర్నలిస్టు ఎందుకు ఈ ప్రపంచం నుంచి మాయమై ఆ జాబితాలో చేరిపోయాడో చూస్తే ఎవరికైనా కళ్లు చెమర్చక మానదు. న్యూజియంలో ప్రత్యేకంగా చెప్పుకో వలసింది పులిట్జర్ ఫోటో అవార్డు పొందిన విభాగం. 1942 నుంచి ఇప్పటివరకూ ఏటా ఏ పాత్రికేయుడు తీసిన చిత్రానికి (అప్పట్లో వార్త రాసే రిపోర్టరే ఫొటోగ్రాఫర్ కూడా. ఒక చేత టైప్ రైటర్, మరో చేత కెమెరా ఉండేవి.) ఎందుకు ఆ ప్రతిష్ఠాత్మక అవార్డు ఇచ్చిందీ కళ్లకు కట్టినట్టు చూపిస్తుందీ విభాగం.

### ఎందరో దాతలు ..

సమాచారం స్వేచ్ఛగా ఒక నదిలా ప్రవహించాలని విశ్వసించే వారంతా కలిసి ఈ న్యూజియంకు ఊపిరి పోశారు. కేవలం పత్రికా స్వేచ్ఛను పరిరక్షించాలన్న ఆదర్శంతో నైట్ ఫౌండేషన్, ఏనెన్బర్గ్ ఫౌండేషన్‌లు లక్షలాది డాలర్లు విరాళంగా ఇవ్వడం వల్లనే ఈ 'న్యూజియం'


అలనాటి ముద్రణా యంత్రం

ఆవిర్భవించింది. వీరే గాక ఇంకా న్యూయార్క్ టైమ్స్, బ్లూమ్ బెర్గ్, ఏబిసి న్యూస్, వాషింగ్టన్ పోస్ట్, సిఎన్ఎన్, ఇతర మీడియా కార్పొరేషన్ లు కూడా ఆర్థికంగా 'న్యూజియం'కు అండదండలు ఇస్తున్నాయి. ఆధునిక మానవ నాగరిక వికాసానికి దర్పణంగా నిలిచే అద్భుతమైన మ్యూజియంలకు వేదిక అయిన వాషింగ్టన్ డి.సి.లోనే, అబ్రహాం లింకన్ మెమోరియల్‌కు సమీపంలోనే ఈ 'న్యూజియం' ఉంది. వాషింగ్టన్‌లో అనేక ప్రదర్శనశాలలకు ప్రవేశం ఉచితం కాని ఈ 'న్యూజియం' చూడాలంటే మాత్రం మనిషికి పాతిక డాలర్లు (దాదాపు రూ. 1500) చెల్లించవలసిందే. కాకపోతే ఒక టిక్కెట్టుతో రెండు రోజులు ఈ 'న్యూజియం' చూడవచ్చు. టిక్కెట్టు ఖరీదు ఎక్కువ కావడంవల్ల సీరియస్‌గా చూసేవారే వస్తారు. అయినా పత్రికలు అంటే ఆసక్తి గల పాఠకులు, పత్రికా రంగం అంటే మానవ జీవన ప్రతిఫలనం అని విశ్వసించేవారు వేల సంఖ్యలో ఉన్నారని తెలిసినపుడు ఆశ్చర్యమేస్తుంది. ఎందుకంటే ప్రతిరోజూ వేలల్లోనే వీక్షకులు వస్తారిక్కడికి.

## వియత్నాం యుద్ధం ఎందుకు?

న్యూజియంలో చాలా అబ్బురపరిచే విభాగం ప్రపంచాన్ని అతలాకుతలం చేసిన అనేక చారిత్రక, రాజకీయ పరిణామాలకు సాక్ష్యంగా నిలిచే విభాగం. అందులో వియత్నాం యుద్ధానికి సంబంధించిన విభాగం కూడా ఉంది. అసలు వియత్నాం యుద్ధం అవసరమా? అన్న ప్రశ్నను మొట్టమొదట మాల్కోమ్ బ్రౌన్ (అసోసియేటెడ్ ప్రెస్), డేవిడ్ హాల్బెర్ స్టామ్ (న్యూయార్క్ టైమ్స్), పీటర్ ఆర్నెట్ (అసోసియేటెడ్ ప్రెస్) వంటి పాత్రికేయులు లేవనెత్తారు. దీనివల్ల ఎవరికి లాభం? వియత్నాం ప్రజలను ఇంత దుస్థితిలోకి నెట్టడం వల్ల అమెరికా ఏం సాధిస్తుంది? వంటి కీలకమైన ప్రశ్నలను కదనరంగం నుంచి వేస్తూ వీరు పంపిన వార్తా కథనాలే ప్రపంచం నలుమూలలా ప్రజాస్వామికవాదులను మరో కోణం నుంచి ఆలోచింపజేశాయి. వీరు ఆ రోజుల్లో ఉపయోగించిన టైప్ రైటర్లు, కెమెరాలు కూడా ఈ 'న్యూజియం'లో భద్రంగా ఉన్నాయి. యుద్ధ రంగం నుంచి ధైర్యసాహసాలతో ఉన్నది ఉన్నట్టుగా రాసినందుకు, సచిత్రంగా చూపించినందుకు ఈ ముగ్గురికీ ప్రతిష్ఠాత్మకమైన పులిట్జర్ బహుమతి లభించింది.




నాజీల క్రౌర్యాన్ని కళ్లకు కట్టినట్టు చూపించే హోలోకాస్ట్ మ్యూజియం, విజ్ఞాన గనులైన స్మిత్సోనియన్ మ్యూజియంల సముదాయం, స్పై మ్యూజియం, నేషనల్ జాగ్రఫిక్ మ్యూజియం, అమెరికా శ్వేత భవనం, కేపిటాల్, సుప్రీమ్ కోర్టు...వంటివన్నీ ఆ చుట్టుపక్కలే ఉంటాయి. కాని వాటి అన్నిటిలోకీ చాలా విశిష్టమైనది ఈ 'న్యూజియం'.

ప్రతి పాత్రికేయునికీ, పాత్రికేయ వృత్తిని ప్రజాస్వామ్య పరిరక్షక వ్యవస్థగా విశ్వసించే ప్రతి పౌరునికీ ఈ 'న్యూజియం' సందర్శన ఒక ఉత్తేజపూరితమైన అనుభవం. ప్రాణత్యాగానికి సైతం సిద్ధపడిన పాత్రికేయులను స్మరించుకునే ఏకైక అంతర్జాతీయ సంస్మరణ వేదిక ఈ 'న్యూజియం'. లాంగ్ లివ్ ఫ్రీడమ్ ఆఫ్ ప్రెస్...

**- జగన్**

journalistjagan@gmail.com

రాతప్రతులు - 7

## కాగితపు చుట్టలు

**భా**రతదేశంలోని వివిధ ప్రాంతాలలో రాతప్రతుల చుట్టలు కనబడతాయి. తెలుగు నేలమీద ఈ చుట్టలు వాడే సాంప్రదాయం మఠాల గురువులకే ఉన్నట్లు కనబడుతుంది. నల్లగొండ జిల్లా కొలనుపాకలోని శైవ మఠాలలో ఇలాంటి రాతప్రతులు ఉన్నాయని చెపుతారు.



ఈ చుట్టల్లో కులపురుషుడు లేదా గురు సంప్రదాయం వివరాలు, కులం పుట్టుక పురాణ రీతిలో కనిపిస్తాయి. మఠం పరిధిలోకి వచ్చే ప్రాంతం, గ్రామాల వివరాలు, భక్తుల సమాచారం వంటి ఎన్నో అంశాలూ ఉంటాయి. దత్తత, పెళ్ళి, భూలావాదేవీలు, జాతకాలు, తంత్ర గ్రంథాలు, రాజశాసనాలు, విజ్ఞప్తి పత్రాలు, తేదీలతో సహా ఏ గ్రామం వారు, ఏ కులం వారు, ఏ మునిని ఆహ్వానించారు వంటి అంశాలూ రాయబడి ఉంటాయి.

హైదరాబాద్‌లోని ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో చుట్ట ఆకారంలో ఉన్న ఖురాన్, అతి చిన్న ఆకారంలో బొమ్మలతో కూడిన భగవద్గీత ఉన్నాయి. కొన్ని కాగితపు చుట్టల్లో శేషనాగుపై శయనించిన విష్ణువు, రాక్షస సంహారం చేస్తున్న దుర్గాదేవి, విశ్వరూప దర్శనమిస్తున్న శ్రీకృష్ణుడు ఉంటే, విజ్ఞప్తి పత్రాల్లో రాజాస్థానం, ఆకాశాన్ని తాకే భవంతులు, ఏనుగులు, తోటలు, బజార్లు, ధార్మిక స్థలాలు, పూజ చేస్తున్న ప్రజలు వంటి ఆకర్షణీయమైన బొమ్మలు ఉన్నాయి.



చుట్టలను దాచటం, ఎక్కడికైనా తీసికెళ్ళడం సులువు. బట్టలపై, చెట్టు బెరడుపై రాసిన చుట్టలు కూడా ఎన్నో ప్రాంతాల్లో ఉన్నాయి. ముఖ్యంగా గిల్గిత్, ఆఫ్ఘనిస్తాన్ ప్రాంతాల్లో ఇవి దొరికాయి. అత్యంత ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే ఒకే కాగితం చుట్టలో రెండు గ్రంథాలు పక్కపక్కన రాసి ఉన్నవీ ఉన్నాయి. వాటిని వేరు చేస్తూ ఓ గీత ఉంటుంది. అలా భగవద్గీత, దేవీభాగవతం పక్కపక్కన రాసి ఉన్న చుట్ట లభ్యమైంది.

## ముద్రలు

**ము**ద్రలను క్రీ.శ. ఒకటవ శతాబ్దం నుండే వాడుతున్నట్టు తెలుస్తోంది. ఒక రకంగా రాజుల సంప్రదాయం ఎప్పటినుండి ప్రారంభమైందో అప్పటినుండే ఈ ముద్రలు కూడా వాడుతున్నారు.



ప్రజలకు, కింది స్థాయి ఉద్యోగులకు ఏమైనా ఆజ్ఞలు, సందేశాలు ఇవ్వాలనుకుంటే ఈ ముద్రలను ఉపయోగించేవారు. ఈ ముద్రలను తయారుచేయడానికి మొదట్లో ఎముకలను, ఏనుగు దంతాలను ఉపయోగించేవారు. మతం, వ్యాపారం, పరిపాలన- ఈ మూడింటికీ ముద్రలను ఉపయోగించేవారు.



**- డా. పాలెపు సుబ్బారావు, 98499 56036**

## తెలుగు హీరో

**'టై**టానిక్' సినిమాను తెలుగులో తీయాలని ఒక ప్రముఖ హీరోని కలిశాడు హాలీవుడ్ నిర్మాత. తెలుగు నేటివిటీకి తగ్గట్టు కొద్ది మార్పులు చేస్తే నటించడానికి తనకు అభ్యంతరం లేదన్నాడు హీరో.

"ఏం మార్పులు కావాలో చెప్పండి" అడిగాడు హాలీవుడ్ నిర్మాత.

"క్లైమాక్స్‌లో ఒక చేత్తో హీరోయిన్ను, మరో చేత్తో షిప్పునూ పట్టుకుని ఈదుకుంటూ ఒడ్డుకు చేరేలా చిన్న మార్పు చేయండి చాలు" చెప్పాడు హీరో.

నిర్మాత మూర్ఛపోయాడు.

## మిక్చర్ పొట్లం

బొమ్మలు : **వెంకట్**

### నో అబ్జక్షన్



"సెల్‌ఫోన్ ఎక్కువగా వాడితే మెదడువాపు వస్తుందట..."

"అది మెదడున్నోళ్లకై ఉంటుంది. నువ్వు మాట్లాడొచ్చు పర్లేదు."

### సారీ .. స్వాహా!

"**అ**దేంటో .. ఎండలో నడుస్తున్నా, వానలో తడుస్తున్నా నువ్వే గుర్తుకొస్తున్నావు రాజా"

"సారీ .. రాణీ, ఈసారి వచ్చినప్పుడు నీ గొడుగు తప్పకుండా తీసుకొచ్చి ఇస్తా".

### చేయనందుకే!

"సీతను కిడ్నాప్ చేశానని రాముడు నన్ను చంపడంలో అర్థముంది. మీ భార్యలను నేను కిడ్నాప్ చేయలేదు కదా, మరి నన్నెందుకు ప్రతి దసరాకి కాల్చి చంపుతున్నార్రా?" కోపంగా అరిచాడు రావణుడు.

"కిడ్నాప్ చేయనందుకే ..." ఏక కంఠంతో వినిపించాయి కొన్ని గొంతులు.

## ఛాయా'చిత్రం'



"మహాప్రభో! ఇక సుత్తి ఆపండి!!"

## ఖాళీగా ఉండట్లేదండి



"బాబూ .. బిటెక్ పూర్తయినట్టుంది. ప్రస్తుతం ఏం చేస్తున్నావు?"
"సాఫ్ట్‌వేర్‌లో ఖాళీ లేదు. హార్డ్‌వేర్‌లో 'గ్రోత్' లేదు. రియలెస్టేట్‌లో రాడీలెక్కువ. కన్‌స్ట్రక్షన్‌లో శాలరీ తక్కువ. అందుకని ఫేస్‌బుక్‌లో అకౌంట్ ఓపెన్ చేశానండి".

## తొక్కలో సూక్తి

ప్రేమా, దోమా రెండూ ఒక్కటే. ఒకటి నిద్ర రాకుండా చేస్తుంది. రెండోది నిద్ర పోకుండా చేస్తుంది.

## ఆ ముక్క ముందే చెప్పాల్సింది!



"హలో .. ఎంత ప్రయత్నించినా విండోస్ తెరుచుకోవట్లేదండీ .."
"కొద్దిగా కొబ్బరి నూనె వేడి చేసి అంచుల వెంట బాగా రుద్దు"
కొద్దిసేపు తర్వాత -
"మీరు చెప్పినట్టు చేస్తే కంప్యూటర్ మొత్తం పాడైపోయింది."
"నేను ఇంట్లో విండోస్ అనుకున్నా".

## రోగం కుదిరింది



"నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను" పేషెంట్.
"ఐ డోంట్ నో తెలుగు ..." నర్స్.
"ఐ లవ్ యూ సిస్టర్ .." పేషెంట్.
"ఐ లవ్ యూ బ్రదర్ .." నర్స్.

## అభినవ ద్రోణుడు

"ఎందుకు నాయనా విచారంగా ఉన్నావు?" దేవుడు.
"ఏముంది స్వామీ .. దారిద్ర్యం .. " మానవుడు.
దేవుడు తన వేలిని పక్కనే ఉన్న ఒక రాయివైపు చూపించగానే అది బంగారుగా మారిపోయింది.
"ఇప్పుడు సంతోషమా .." దేవుడు.
"అదెన్నాళ్లు స్వామీ .." మానవుడు.
దేవుడు ఒక చెట్టువైపు వేలు చూపించగానే చెట్టు బంగారమైంది.
"ఇప్పుడు సంతోషమా .." దేవుడు.
"ఏదో కొన్నాళ్లు పర్వాలేదు ... తర్వాత మళ్లీ దారిద్ర్యమే కదా .."
"ఏమిస్తే నీకు సంతోషం కలుగుతుందో చెప్పు నాయనా .. " దేవుడు.
"మీ చూపుడు వేలివ్వండి" మానవుడు.
"ఆc .. " అదృశ్యమయ్యాడు దేవుడు.

# ఎడతెరిపి లేని ...

ఈ వారం కవిత

ఒకానొక మోహావేశంలో పరుగెత్తీ పరుగెత్తీ
కళ్లు తెరిచి చూసిన ఒక క్షణాన
జీవితం, పరుగు మొదలు పెట్టిన చోటే
పరిహసిస్తూ నిలబడి ఉంది

ఒక్కటొక్కటిగా ఉబికిన కన్నీటి బిందువులతో
ఈ దేహాత్మలెపుడు నిండు కడవలైనవో తెలియనే లేదు
రాత్రుళ్లు సుడులు తిరిగే దుఃఖాలు ఎంతగా తడిపినా
పగలు చిరునవ్వు తెరచాప ధరించడం నేర్చిన నేత్ర ద్వయం

ఏ ఫలాలను అందుకోవడం కోసం మొదలైన ప్రయాణమిది
మరి, ఇపుడే ఫలాల కోసం విరామమెరుగని పరుగిది
తెలిసీ చెప్పకపోతే తల వేయి ముక్కలయే రహస్యమిది
చెప్పుకున్నాక, తిరిగి చెట్టెక్కవలసిన తెగని కథ యిది

తడుముకునే కొద్దీ సలపరించే గాయాలు
ఎవరు ఎప్పుడు చేసినవో ఆనవాళ్లు దొరకవు
మరింతగా తడుముకునే కొద్దీ అవగతమయే రహస్యం
గాయాలకు కర్త కర్మ క్రియా నేనేనని

అలుపు లేకుండా సాగిపోయే పాటల నడుమ
పుటలు పుటలుగా మరలిపోయే పుస్తకాల నడుమ
కాలయంత్రాన్ని నిలువరించే వెర్రి ప్రయత్నంలో
ఎడతెరిపిలేని వర్షంలో తడుస్తూ ఈ రాత్రి

అన్ని ప్రయత్నాలూ వృథా ప్రయాసలుగా మిగిలాక
గది తలుపులు తెరుచుకుని బాల్కనీ చీకటిలో
ఇలా రెండు చేతులూ చాపి నిలబడితే
నేత్రద్వయాన్ని శుభ్రం చేస్తూ దయగల చినుకులు

**- కోడూరి విజయకుమార్, 83309 54074**



బొమ్మలు : అక్బర్

# అనుగ్రహం

23-29 అక్టోబర్ 2016

డాక్టర్ పి.ఎ.రామన్



### మేషం : అశ్వని, భరణి, కృత్తిక 1వ పాదం

ఆశయ సాధనకు ఓర్పు, పట్టుదల ముఖ్యం. ఎవరిపై ఆధారపడవద్దు. స్వయంకృషితోనే రాణిస్తారు. ఆదాయ వ్యయాలు ఫర్వాలేదనిపిస్తాయి. పనులు మొండిగా పూర్తి చేస్తారు. కావలసిన వ్యక్తుల కలయిక అనుకూలించదు. గురు, శుక్ర వారాల్లో మీపై శకునాల ప్రభావం అధికం. పనులు మందకొడిగా సాగుతాయి. బాధ్యతలు స్వయంగా చూసుకోవాలి. ఇతరుల విషయాల్లో జోక్యం తగదు. బంధువుల వ్యాఖ్యలు బాధిస్తాయి. ఒక ఆహ్వానం ఆశ్చర్యం కలిగిస్తుంది.



### వృషభం : కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు

విమర్శలు, అభియోగాలకు దీటుగా స్పందిస్తారు. ఆలోచనలు కార్యరూపం దాల్చుతాయి. పట్టుదలతో అనుకున్నది సాధిస్తారు. ఖర్చులు అంచనాలకు భిన్నంగా ఉంటాయి. రుణాలు, చేబదుళ్లు స్వీకరిస్తారు. మీ శ్రీమతి సాయంతో ఒక సమస్య సానుకూలమవుతుంది. శనివారం నాడు పనులు హడావుడిగా సాగుతాయి. ముఖ్యమైన పత్రాలు అందుకుంటారు. వృత్తి ఉద్యోగ బాధ్యతల్లో ఏకాగ్రత వహించండి. ఉపాధి పథకాల్లో నిలదొక్కుకుంటారు. ప్రయాణంలో జాగ్రత్త.



### మిథునం : మృగశిర 3,4; ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు

పట్టుదలకు పోయి అవకాశాలను వదులుకుంటారు. ఖర్చులు అంచనాలను మించుతాయి. ఆదాయ మార్గాలు అన్వేషిస్తారు. సన్నిహితులే సాయం చేసేందుకు వెనుకాడుతారు. పనులు మందకొడిగా సాగుతాయి. ఆలోచనలతో మనస్థిమితం ఉండదు. ఆత్మీయుల కలయికతో ఉపశమనం పొందుతారు. ఒక సమాచారం ఉత్సాహాన్నిస్తుంది. అవివాహితులు శుభవార్తలు వింటారు. వ్యాపారాలు అంతంత మాత్రంగా సాగుతాయి.



### కర్కాటకం : పునర్వసు 4వ పాదం, పుష్యమి, ఆశ్లేష

ఈ వారం కొత్త యత్నాలు ప్రారంభిస్తారు. అవకాశాలు కలిసివస్తాయి. ఊహలు, అంచనాలు ఫలిస్తాయి. ఖర్చులు భారమనిపించవు. సంతానం కోసం బాగా వ్యయం చేస్తారు. పరిచయాలు బలపడతాయి. పదవులు, బాధ్యతలు స్వీకరిస్తారు. పొగడ్తలు, మొహమ్మాటాలకు పోవద్దు. విలువైన వస్తువులు జాగ్రత్త. ఆరోగ్యం సంతృప్తికరం. అయిన వారితో సంప్రదింపులు జరుపుతారు. నిరుద్యోగులకు ఉద్యోగయోగం.



### సింహం : మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం

మీ మాటతీరు ఆకట్టుకుంటుంది. ఆదాయం సంతృప్తికరం. అవసరాలకు ధనం అందుతుంది. విలాసాలకు బాగా వ్యయం చేస్తారు. చెల్లింపులు, నగదు స్వీకరణలో జాగ్రత్త. శుభకార్యం నిశ్చయమవుతుంది. వ్యవహార ఒప్పందాల్లో ఏకాగ్రత వహించండి. స్తోమతకు మించి హామీలివ్వవద్దు. మీ శ్రీమతి సలహా పాటించండి. ఆది, సోమ వారాల్లో పనులు హడావుడిగా సాగుతాయి. ప్రముఖుల ఇంటర్వ్యూ కోసం పడిగాపులు తప్పవు. పోగొట్టుకున్న పత్రాలు తిరిగి పొందుతారు.



### కన్య : ఉత్తర 2,3,4; హస్త, చిత్త 1,2 పాదాలు

పొదుపు చేయాలన్న ఆలోచన ఫలించదు. దంపతుల ఆలోచనలు విరుద్ధంగా ఉంటాయి. ఓర్పుతో వ్యవహరించండి. పనులు ముగింపు దశలో నిదానంగా సాగుతాయి. మీపై శకునాల ప్రభావం అధికం. ఆహ్వానాలు అందుకుంటారు. మంగళ, బుధ వారాల్లో అవకాశాలు చేజారిపోతుంటాయి. పట్టుదలతో యత్నాలు సాగించండి. వ్యాపారాభివృద్ధికి మరింతగా శ్రమించాలి. ప్రస్తుత వ్యాపారాలే శ్రేయస్కరం. వృత్తి ఉపాధి పథకాల్లో నిలదొక్కుకుంటారు. ఉద్యోగస్తులకు ఏకాగ్రత ప్రధానం.



### తుల : చిత్త 3,4; స్వాతి, విశాఖ 1,2,3 పాదాలు

ఉద్యోగ బాధ్యతలను సమర్థంగా నిర్వహిస్తారు. మీ కృషి ఫలిస్తుంది. ఉన్నత పదవులు అందుకుంటారు. కొత్త పరిచయాలేర్పడతాయి. ఖర్చులు విపరీతం. విలాసాలకు బాగా వ్యయం చేస్తారు. గురు, శుక్ర వారాల్లో లౌక్యంగా పనులు చక్కబెట్టుకోవాలి. మీ ప్రమేయంతో శుభకార్యం నిశ్చయమవుతుంది. అయిన వారితో సంప్రదింపులు జరుపుతారు. ఎదుటివారి అభిప్రాయాలకు విలువ ఇవ్వండి. ఏ విషయాన్ని తెగే వరకూ లాగవద్దు. పెద్దమొత్తం సరుకు నిల్వలో జాగ్రత్త.



### వృశ్చికం : విశాఖ 4వ పాదం; అనూరాధ, జ్యేష్ఠ

ప్రతి విషయంలోను అప్రమత్తంగా ఉండాలి. తొందరపడి నిర్ణయాలు తీసుకోవద్దు. అనుభవజ్ఞుల సలహా పాటించండి. దుబారా ఖర్చులు అధికం. ఒక అవసరానికి ఉంచిన ధనం మరోదానికి వ్యయం చేస్తారు. సంతానం మొండివైఖరి అసహనం కలిగిస్తుంది. శనివారం నాడు పనులు ప్రారంభంలో చికాకులెదుర్కుంటారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. నిరుద్యోగుల కృషి ఫలిస్తుంది. పెట్టుబడులకు అనుకూలం. ఆత్మీయుల ఆహ్వానం సందిగ్ధానికి గురిచేస్తుంది.



### ధనుస్సు : మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పాదం

ఆర్థికస్థితి సామాన్యం. ఎంత శ్రమించినా ఫలితం అంతంత మాత్రంగానే ఉంటుంది. పరిస్థితులు అనుకూలించక నిరుత్సాహం చెందుతారు. అవకాశాలు అందినట్టే చేజారిపోతుంటాయి. మీపై ఇతరుల వ్యాఖ్యల ప్రభావం అధికం. ఆది, సోమ వారాల్లో పనులు నిదానంగా సాగుతాయి. అప్రమత్తంగా వ్యవహరించాలి. రహస్యాన్ని దాచలేని మీ బలహీనత ఇబ్బంది కలిగిస్తుంది. ఆత్మీయుల రాకతో కుదుటపడతారు.



### మకరం : ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం, ధనిష్ట 1,2 పాదాలు

ప్రతిభాపాటవాలు వెలుగులోకి వస్తాయి. అవకాశాలను సద్వినియోగం చేసుకుంటారు. శుభకార్యయత్నం ఫలిస్తుంది. వివాహ వేదికలను అన్వేషిస్తారు. పనులు వేగవంతమవుతాయి. ఖర్చులు అధికం, ధనానికి ఇబ్బంది ఉండదు. పొదుపు పథకాల పట్ల ఆకర్షితులవుతారు. ప్రైవేట్ సంస్థల్లో మదుపు క్షేమం కాదు. ఆత్మీయులకు సాయం అందిస్తారు. మంగళ, బుధ వారాల్లో ఆశ్చర్యకరమైన సంఘటనలెదురవుతాయి.



### కుంభం : ధనిష్ట 3,4; శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు

వ్యవహార దక్షతతో రాణిస్తారు. అంచనాలు ఫలిస్తాయి. ఇంటా బయటా అనుకూలతలుంటాయి. ఆత్మీయులకు సాయం అందిస్తారు. బంధువులతో సంబంధాలు బలపడతాయి. ఖర్చులు భారమనిపించవు. కొన్ని పనులు అనుకోకుండా పూర్తవుతాయి. ఆహ్వానాలు, నోటీసులు అందుకుంటారు. ఆది, గురు వారాల్లో అప్రియమైన వార్తలు వినవలసి వస్తుంది. కార్యక్రమాలు వాయిదా వేసుకుంటారు. విద్యార్థులకు అత్యుత్సాహం తగదు. ఉద్యోగస్తులకు ఏకాగ్రత ప్రధానం, అధికారులకు ధనప్రలోభం తగదు.



### మీనం : పూర్వాభాద్ర 4వ పాదం, ఉత్తరాభాద్ర, రేవతి

అన్నింటా మీదే పైచేయి. అవకాశాలను సద్వినియోగం చేసుకుంటారు. బంధుత్వాలు, పరిచయాలు బలపడతాయి. శ్రమాధిక్యతతో పనులు పూర్తి చేస్తారు. అవసరాలకు ధనం అందుతుంది. మంగళ, బుధ వారాల్లో చెల్లింపులు, నగదు స్వీకరణలో జాగ్రత్త. శుభకార్యం సానుకూలమవుతుంది. వ్యవహార ఒప్పందాల్లో ఏకాగ్రత వహించండి. స్తోమతకు మించి హామీలివ్వవద్దు. స్వల్ప అస్వస్థతకు గురవుతారు. విశ్రాంతి అవసరం. వ్యాపారాల్లో ఒడిదుడుకులను దీటుగా ఎదుర్కుంటారు.

## అవునా!



ట్రాన్స్-సైబీరియన్ రైలు మార్గంలో ప్రయాణించేవాళ్లు 3901 వంతెనలు దాటాల్సి ఉంటుంది.

b మానవ శరీరంలోని సగానికి పైగా ఎముకలు చేతులూ, పాదాల్లోనే ఉంటాయి.

b విస్తీర్ణం రీత్యా ప్రపంచంలో అతిపెద్ద నగరం హులున్‌బూర్ (మంగోలియా). దాని విస్తీర్ణం 2,63,953 చ.కి.మీ.




ప్రపంచంలో అతి చిన్న పేరుగల ప్రాంతం Å. అది స్వీడన్, నార్వేల మధ్య ఉంది.

b మధ్య ప్రాచ్య దేశాలలో ఎడారి లేని ఒకే ఒక దేశం లెబనాన్.

b న్యూజిలాండ్‌లో ఉండే 'కియా' అనే పక్షి కారు విండో చుట్టూ ఉండే రబ్బరును ఇష్టంగా తింటుంది.



తీరం లేని ఒకే ఒక్క సముద్రం సర్గాసో సముద్రం. ఉత్తర అట్లాంటిక్ మహా సముద్రం మధ్యలో ఓషన్ కరెంట్స్ నడుమ ఉంటుంది ఈ సముద్రం.

b ప్రతిరోజూ ప్రపంచవ్యాప్తంగా ఇరవై బ్యాంకులు దోపిడీకి గురవుతున్నాయి.

b ప్రఖ్యాత హాకీ క్రీడాకారుడు ధ్యాన్‌చంద్ 16 ఏళ్ల వయసులో బ్రిటిష్ ఇండియా ఆర్మీలో సిపాయిగా చేరాడు.

# అదృష్ట రత్నజ్యోతి

## రమేశ్చంద్ర మహర్షి

సెల్ : 92465 82255, ఫోన్ : 040-6522 5554

**డి.పి.టి., హైద్రాబాద్**

**మా అమ్మాయి జన్మకుండలి నిర్మొహమాటంగా వివరించగలరు.**

ఈ జన్మకుండలి ప్రకారం-

నక్షత్రం ఆర్ద్ర. మిథున రాశి.

1. **విద్య :** గురు కుజుల సమసప్తక దృష్టి, అధిపతికి శుక్ర సాంగత్యం, రవి బుధుల కలయిక, ఆ ఇద్దరికీ ఉన్నత విద్యా స్థానాధిపతి బృహస్పతి వీక్షణ... వంటి కాంబినేషన్స్ వలన విద్య బి.టెక్, ఎమ్.బి.ఎ., నీచభంగ రాజయోగం వలన ఎమ్.టెక్ కూడా!

2. రెండు నీచభంగ రాజయోగాలూ, ఒక రాజయోగం, శశ మహాయోగం... జన్మకుండలికి మంచి పుష్టి కలిగింది.

3. పరివర్తన యోగం వలన ఒక చిత్రమైన హాబీ ఉంటుంది. వాహనాలు కొనడం, అమ్మడం. అలాగే స్థిరాస్తులు కూడా. ఈ కాంబినేషన్‌ని ఈమె భర్త ఉపయోగించుకుని, రియల్ ఎస్టేట్/కన్‌స్ట్రక్షన్ బిజినెస్‌లు చేసుకోవచ్చు.

4. ఒక మామూలు లెక్చరర్‌గా తన వృత్తిని ప్రారంభించి హెచ్.ఓ.డి, ప్రిన్సిపాల్... స్కై ఈజ్ ద లిమిట్... వి.సి అయినా ఆశ్చర్యపోనక్కర లేని జన్మకుండలి ఇది... అన్నట్టుగా ఉన్నా కూడా ప్రిన్సిపాల్‌తోనే ఆగిపోవడం అనివార్యం. కారణం, ఉద్యోగ స్థానాధిపతికి రవి కుజుల మధ్య కలిగిన పాపకర్తరి... బంధనయోగం!

ఆ ఒక్క కోణంలో పరిహారాలు గట్టిగా పాటిస్తే ఈ జన్మకుండలి అసాధారణమే అని చెప్పుకోవచ్చు. ఆ పాటించాల్సిన పరిహారాల్లో ఒకటి... పుష్యరాగధారణ.

5. అలాగే ఈ జన్మకుండలిలో ఉన్న మరో ముఖ్యమైన అంశం... శుక్ర చంద్రుల వలన ఉత్పన్నమవుతున్న సృజనాత్మక శక్తి! అయితే శక్తి వేరు, దానికొచ్చే పేరు వేరు! అలా గుర్తింపు పొందడంలో ఆలస్యం, ఈమె క్రియేటివిటీని ఇతరులు... తస్కరస్య కుతో ధర్మః... తస్కరించుకుపోతుండడం... ఒక సాధారణమైన విషయం. అలా పోగొట్టుకునే వాటిలో ఈమె డాక్టరేట్ కూడా ఒకటి కావడం ఆశ్చర్యపడ నక్కరలేని విషయం!!

6. ఇక వివాహం - కళత్ర భావంలో ఉచ్ఛ శని. కూడా కేతువు. అధిపతికి ద్వికళత్ర స్థితి. చంద్ర సాంగత్యం. చంద్రునిలో ఇంబైబ్ అయి ఉన్న గ్రహయుద్ధం. కుజ దోషం. స్థానం మీద కుజ రాహువుల వీక్షణ. ఫలితం... మొదటి వివాహం జరిగి భార్యతో విడిపోయిన వ్యక్తితో ఈమె వివాహం జరుగుతుంది.

ఈమె వివాహం జరగడంలో కలిగిన అర్థం కాని ఆలస్యం కూడా దీనికి ఒక కారణం. ఇలా జరగడం నిజానికి ఒక పరిహారం కూడా. ఏది ఏమైనా వైవాహిక జీవితం బాగానే ఉంటుంది. ఇక విడిపోవడం ఉండదు.

7. సంతానం... అధిపతికి స్థితి చతుర్థంలో. షష్టమాధిపతితో సాంగత్యం, ఆయనే కంట్రోలింగ్ ఫేక్టర్, స్థానం మీద రాహువు వీక్షణ, అధిపతి మీద శని వీక్షణ, కారకుని వీక్షణ... కానీ కారకునికి చంద్రుడు కంట్రోలింగ్ ఫేక్టర్... వెరసి సంతానం ఉంటుంది, కానీ అది తనది కాదు... తన భర్త సంతానాన్నే తన సంతానంగా భావించి ఉండిపోవడం...

న హ్యాహాని నివర్తంతే... తిరిగిరాని గడిచిపోయిన కాలం, తీసుకున్న నిర్ణయాలు, జీవితం మీద నుండి నడుచుకుంటూ వెళ్ళిపోయిన పాద ముద్రలు... కారణం, జీవితం అవసరం పునాది మీద నిర్మించబడిన సౌధం! మనసు, మంచు కప్పిన లోయలా కనిపించే అగాధం!!

**స్థిరాస్తులు :** శనిలో కుజునిలో... అంటే 40వ ఏట స్వగృహయోగం. ఎపార్ట్‌మెంట్‌లా కాకుండా ఇండిపెండెంట్ హౌజ్! అది 54 వయసులో డిస్పోజాఫ్ చేయడం జరుగుతుంది. తిరిగి 63 వయసు నుండి మంచి గృహయోగం... బంగ్లా.

ఇది "ఈమె పేరు మీద" ఏర్పడే ఆస్తుల గురించి అన్న విషయం గ్రహించేది.

ఏది ఏమైనా వ్యక్తిగతంగా అనుభవంలోకి వచ్చే నిర్వేదాన్ని పక్కన పెడితే, ఈ చార్ట్‌ని సామాజికంగా గొప్ప పేరుతో తన రంగంలో సాధించిన పెను మార్పులకు "షి యీజ్ ద బ్రెయిన్స్ బిహైండ్" అన్న ప్రతిష్ఠతో పరిఢవిల్లే జన్మకుండలిగా పేర్కోవాలి!!

# ఆనవాల్లు ఆగమైన అవ్వ

ఈ వారం కథ

1 జూపాక సుభద్ర



బొమ్మలు : **చారి పి.ఎస్**

**నేనిప్పుడు గౌరుమెంటు నౌకరిని. మాది ఇప్పటికీ బడి లేని, బస్సు లేని బ్యాక్‌వర్డ్ పల్లె. నాకున్న పెద్దకులాల దోస్తుల తల్లిదండ్రుల్లాగ మా తల్లిదండ్రులు బూసాములు, రైతులు కాదు. తమ పిల్లల్ని సిటీలల్ల బెట్టి సదివిచ్చే సక్కదనాలున్నోల్లు కానేగాదు. కూలినాలి జేసుకునేటోల్లు, ఏడేడు తరాలు ఎట్టి జేసుకుని బతికినోల్లు. సదువంటె ఏందో తెలువనోల్లు. ఎవరో తెల్సినోల్లు సోషల్ వెల్ఫేర్ హాస్టల్లేస్తె... సదువు రుసి మరిగి ఆగకుంట యూనివర్సిటీ దాకాబోయి నౌకరి పరీక్షలు రాసి రాసి నౌకరి గొట్టిన.**

**అ**యితే నాకు కతలు, నవలలు, కైతలు సదువుడు చానిష్టం. చిన్నప్పుడు డక్కలి కతలు, సిందు కతలు, కాకి పడుగులోల్ల కతలు, గొల్ల కతలినుడు మస్తు యిష్టంగుండె. వాల్లుజెప్పే ఎల్లమ్మ కతలు, మల్లన్న కతలు, జాంబపురాణం, 'అల్లిరాని' కతలు చూసి, యిని, మల్లా మా దోస్తుల ముందు అట్లనే ఆడి పాడి మురుసుకునేది. అట్లా కతలు వినుడు పెద్దగైనంక కష్టమైంది. కతలు విననీకి పోనియ్యక పోదురు మా అన్నలు. అందుకని పుస్తకాలల్ల ఉండే కతలు, నవలలు, డిటెక్టివ్ నవలలు ఏం దొరికితె అది నవిలేసేది. అంతిష్టముండె సదువుడంటె. అట్లా రష్యన్ అనువాదాలు, చైనా అనువాదాలు, ఉద్యమ సాహిత్యాలు, జాతీయోద్యమం, తెలంగాణ సాయుధ రైతాంగ పోరాట సాహిత్యం, కమ్యూనిస్టు సాహిత్యం, పురాణ సాహిత్యాలు ఇట్లా ఏది ఇడవకుంట సదివేది. అయితే ఈ సాహిత్యాలల్ల మా అవ్వలు, అక్కలు, తాతవ్వలు, మా ఆడోల్లు, మా వాడ పర్యావరణాలు ఎక్కడ కనబడకపోయేది. మా వాల్లు ఏం దిన్నరు, ఎట్లా బతికింద్రు? వాల్ల కట్టేంది? బొట్టేంది?, వాల్ల పరిసరాలు ఎట్లుండె, వాల్ల వైద్యాలేంటియి, వాల్ల సంఘర్షణలు, వాల్ల ఆట, పాట, మాటలకు సంబంధించినయి ఏ సాహిత్యాలు రికార్డు చెయ్యలే... ఈ సాహిత్యాలు మాయిగాని జీవితాలు, యవ్వారాలు. ఎక్కడా మా ముత్తవ్వల, తాతవ్వల ఆనవాల్లు దొర్కలే... సదివి సదివి యాష్టకచ్చి వాల్లు వీల్లేంది మేమే రాస్కుంటము మా చరిత్రలను అని నేను రాసుడు మొదలువెట్టిన.

నా రచనలు నచ్చిన ఏ దోస్తులు చెప్పింద్రో ఏమో నాకు విదేశీ యూనివర్సిటీ నుంచి 'సాహిత్య మీటింగ్'కు రమ్మని పిలుపొచ్చింది. ఓ చాన సంతోషపడ్డ. ఆకాశంల దూది పింజోలె ఎగుర్తంది మనసు. ఆకాశంల చుక్కల్ల చుక్కోలె, మబ్బుల్ల మబ్బోలె ఎగిరిపోవచ్చు. చిన్నప్పుడు మెడలిరిగి పోయేటట్లు, కండ్లు కమిలిపోయేటట్లు 'అగో గాలి మోటరు బోతంది' అని 'కొంగా కొంగా బువ్వెయ్యే దేవునింట్లాపైసేత్త' అని చేతులు గుండ్రంగ తిప్పి చేతిగోల్లు చూసుకొని ఏదన్న గోరుమీద తెల్లచార కనబడితే... ఆ నాకు బువ్వేసింది చూడు చూడుమని దోస్తులందరం ఒకరికొకరు చూయించుకొని సంబరపడే యాదులన్ని మెదిలినయి.

ఇన్నాల్లు బూమ్మీద నన్ను భయపెట్టిన గుట్టమ్మలు కొండమ్మలు మేమెవ్వరికీ అందని ఎత్తుమడాల పర్వతమ్మలు, అంతా నేనేనని గంభీరంగా అలల్తో దూరంగొట్టే సముద్రయానాలు, దొరక్కుంటా ఉరుకుతా బెదిరిచ్చే నదమ్మలను తలదన్ని, వాటి తలల మీంచి పోబోతున్న చూడుండ్రమ్మా... అని ఎక్కిరించుకుంట వాటినేడిపిచ్చుకుంట ఆకాశంల ఇంద్రదనుసోలె పోవచ్చునీ, సందమామను ఎన్నెలను కండ్లనిండ నింపుకోవచ్చునీ, ఎదనిండ వొంపుకొవచ్చుని... ఇట్లా రాత్రి కలలు, వెలుతురు కలలు ఎన్ని ఇరగదీసిన్నో లెక్కే లేదు. పుట్టినకాన్నుంచి నేలమీద మట్టి సుట్టే సాగింది నా బతుకు పయనం. ఇప్పుడు నేలనిడిసి నింగిల మబ్బుతోటల్ల ఒక పగలు ఒక రాత్రి పయనమట అనే బుగులు గూడుంది.

అయితే ఈ కలలు పండనీకి చాన కతలు బడాల్నని మా దోస్తులు చెప్తుంటరు.
విదేశాలల్లో ఉన్న వాల్ల పిల్లలకాడికి బోయొస్తుంటరు గనక మా దోస్తులకు పాస్‌పోర్టు, వీసా సంగతులు బాగ తెల్సు. నా సాహిత్య దోస్తులు గూడ పోయొస్తుంటరు సాహిత్య మీటింగులకు. అట్లా తన బిడ్డె దగ్గరికి పోయొచ్చిన మా దోస్తు నిర్మలని అడిగిన, విదేశాలకు పోవాలంటే ఏమేం కావాలె, ఎట్ల తీస్కోవాలె, ఎవరిస్తరనే వివరాలడిగిన. "ముందు పాస్‌పోర్టుకు అప్లయి చేయి, దాంతర్వాత వీసాకి పెట్టుకో" అన్నది. ఎట్ల? నాకేం దెలువది, నేను విదేశాలకు పోతానని ఎప్పుడు అనుకోలే... అట్లాంటి అవకాశాలు మాలాంటి మట్టి ఎట్టి మనుషులకేడొస్తయిలే అని ఆ జ్ఞానం జోలికిపోలే. అదే అడిగిన ఎట్ల అప్లయి జేసుకోవాలెనని. "నాకు తెల్సిన ఏజెంటున్నడు, అతడడిగిన డాక్యుమెంట్స్ ఇస్తే అప్లయిజేసి నిన్ను ఇంటర్వ్యూకి పంపిస్తడు. వాల్లు అన్ని సరిగ్గ ఉన్నయా లేవా అని చూసుకొని పాస్‌పోర్టు ఇంటికే పంపిస్తరు" అని చెప్పి ఆ ఏజెంటును పిలిపిచ్చింది.

ఆ ఏజెంటు నా గుర్తింపు కార్డు, ఆధార్‌కార్డు, పుట్టినతేదీ సర్టిఫికెట్, ఆఫీసు నుంచి నో అబ్జెక్షన్ సర్టిఫికెట్ (ఎన్‌ఓసి), పాస్‌పోర్ట్‌కయ్యే ఖర్చు ఇస్తే చాలని... తనే అప్లయ్ చేస్తానని చెప్పిండు. అతను చెప్పినట్లు అన్నీ సమకూర్చి యిచ్చినంక "మీ తల్లి, తండ్రి, భర్త పేర్లు రికార్డుల్లో

ఎట్లా ఉంటే అట్లా ఎలాంటి స్పెల్లింగుల తేడా రాకుండా నాకు జాగ్రత్తగా రాసివ్వమ"ని అడిగిండు.

మా తండ్రి చదువుకోలే. కాని బ్యాంకప్పుల్లో, పట్టా కాయితాల మీద, నా సర్టిఫికెట్లన్నింటి మీద... అంటే నా క్యాస్ట్ సర్టిఫికెట్, నా టీసీ కాపీల మీద, నా సర్వీసు రిజిస్టర్ల నా తండ్రి పేరు 'నర్సయ్య' అని రాసి ఉంది. అట్లనే మా హబ్బి చదువుకుండు గనక ఓటరు కార్డు ఆధార్ కార్డు గిట్ల అన్నింట్ల అతని పేరుకి సంబంధించిన రికార్డులకు కొదువ లేదు. మా నాయన, ఇంటాయన పేర్లు రికార్డుల ఎట్లున్నయో ఇంగ్లీషు స్పెల్లింగ్‌లతో సహా చెప్పేసిన ఏజెంట్‌కు. తల్లి పేరు కూడా రికార్డుల్లో చూసి చెప్పమన్నడు. ఆమెను అందరూ 'కనికీర' అని పిలుస్తారు. కనికీరక్క, కనికీరవ్వ అని ఊరోల్లు, చుట్టాలు, మావాడకట్టోల్లు బిలుస్తరు. మా తల్లి పేరు 'కనికీర' అనేందుకు రుజువేంది, ఏడ రాసి ఉంది? అని చూస్తే అంతా శూన్యమే. ఎక్కడా ఆమె పేరున్న పేపరు లేదు. ఎక్కడా రికార్డయి లేదు అని తెలిసి నా శ్వాస ఆగిపోయేంత దుక్కమొచ్చింది.

మా తల్లికి నను కనిపెంచిన మా అవ్వకి పదారేండ్ల కిందనే ఈ బూమ్మీద నూకలు జెల్లిపోయినయి. అరవై అయిదేండ్లు ఆ ఊర్లెనె బతికింది. ఇప్పటికి ఊరికి బొయినా మా అవ్వ పేరు ఊరి నాలికల నిండా నడయాడ్తది. నన్నింకా 'కనికీరక్క బిడ్డె' అనే పిలుస్తరు. మా అవ్వ బూమికి చాతిచ్చి బువ్వబండిచ్చినామె. పన్నెండుమందిని కని సాది సమాలిచ్చి పెండిల్లు పేరంటాలు పురుల్లు ఎల్లదీసినామె. భూకబ్జాకోరులతోని కొట్లాడి బూమిని బిడ్డెలాగ కాపాడుకున్న కనికీర, పెనిమిటి మూలబడితే అనేక సెరలబడి బూమిల బంగారం బండిచ్చిన కనికీర... మా ఊరి జనాల నోల్లల్ల నానినా రికార్డుల్ల ఎక్కడున్నది? జీవితాంతం కాలుమలుగని కష్టం జేసిన మా తల్లి పేరు ఎక్కడ అని శోధన మొదలైంది. ఆమె పుట్టినరోజు రికార్డు లేదు. చనిపోయిన రోజు రికార్డు లేదు. ఆమెకు బడిగోడ ఎట్లుంటదో తెలువది. ఆమె పేరు మీద, ఆమె పేరుతోటి ఎట్లాంటి లావాదేవీలు జరగలే కుటుంబంల. రేషన్‌కార్డు లేదు. బూమున్నోళ్ళకు రేషన్ కార్డు ఎందుకని ఆ జమానాల ఇవ్వలేదు. ముసలోల్ల పెన్షన్, విడో పెన్షన్ రాలే. బూమి పట్టాలల్ల ఆడ పేర్లే ఉండేటియి కాదు. పదారేండ్ల కింద ఆధార్ కార్డుల్లేవు. ఓటరు కార్డు యిప్పటోలె బందవస్తుగ ఆ కాలంల లేదు. చిన్న కాయితం ఇచ్చేది. ఆమె కట్టిన దూలాల ఇల్లే నేలమట్టమైంది, ఇంక ఓటరు కాయితాలేడుంటయి? నా తల్లి చేసిన జీవన పోరాటాలు, ఆమె పాటలు, పనితనము, ఆమె తీగరాగాలు, ఆమె పాడే కాముని పాటలు, బతుకమ్మ పాటలు, కలుపు కోత, నాటు పాటలు పోనీయ్ కనీసం ఆమె పేరుకు సంబంధించిన నమోదుల ఆనవాల్లు లేకపోవుడు, దొరక్కపోవుడు అర్తమై జ్వరమొచ్చింది, నిద్రబట్టలే. ఆమె చరిత్ర లేకపోయె, మా అవ్వ బతికున్న పేరు కూడ రికార్డుల్లో లేకపోవుడు జూసి చాన పరేషానైన.

ఎంతన్యాయం? మౌఖిక చరిత్రల్ని లిఖిత చరిత్రలు చీకటి చేస్తున్నయి. ఆడ చరిత్రల్ని మగచరిత్రలు కప్పిపెడ్తున్నయి. ఎండ చరిత్రల్ని నీడ చరిత్రలు కమ్మేస్తున్నయి.

నేను చదువుకున్నందుకు, నా సర్టిఫికెట్ల మీద తండ్రి పేరన్నా మిగిలింది. నేం చదువుకోకుంటె, మా తండ్రికి గుంట సెంటు బూమి లేకుంటె... ఏ కార్డులు గవర్నమెంటుయి లేకుంటె... మా తల్లి పరిస్థితే మా తండ్రికుండేది.

ఈ తండ్లాటతోని మా ఊరి సర్పంచికి ఫోన్ చేసిన "అయ్యా! మా అవ్వ 'కనికీరవ్వ' మీకు తెల్సుగదా! ఆమె పేరు మీ గ్రామ పంచాయితీ రికార్డుల్ల ఏ రికార్డుల ఉందో, ఏమని ఉన్నదో నాకు చెప్పవా! నాకు అర్జంటుగా కావాలె. ఆమె పేరు రికార్డుల్లో ఏమని ఉన్నదో ఉన్నదున్నట్లు జెప్పాలె" అని చెప్పిన. ఆ సర్పంచి 'రేపు జూస్త, మాపు జూస్త'ని చెప్పబట్టేసరికి చివరికి నేనే



పోయిన మా వూరి పంచాయితాఫీసుకు. మా అవ్వ పేరు ఎట్లా ఉందో చూద్దామని, యెత్కుదామని పోయిన.

పంచాయితాఫీసుల, మండలాఫీసులల్ల బూమికి సంబంధించిన అన్ని పట్టా పుస్తకాల మీద పాసుపుస్తకాల మీద యెతికిన పిచ్చిబట్టినట్టు. ఏ రికార్డులల్ల లేదు. 'కనికీరవ్వా, కనికీరక్కా' అని పిలిసే పేరు రికార్డుల్ల ఉంటదా? ఏ రికార్డు ఆధారంగా శోధించాలి? ఏదో ఒక ఆధారం దొర్కపోతదా అనే ఆశతో వెతికిన. ఈ

**ఎంతన్యాయం? మౌఖిక చరిత్రల్ని లిఖిత చరిత్రలు చీకటి చేస్తున్నయి. ఆడ చరిత్రల్ని మగచరిత్రలు కప్పిపెడ్తున్నయి. ఎండ చరిత్రల్ని నీడ చరిత్రలు కమ్మేస్తున్నయి.**

పాస్‌పోర్టేమో గానీ... మా తల్లి పేరు కోసం ఒక యుద్ధం లాగ వెతికిన. వరంగల్ జిల్లా రేగొండ మండలం దామరంచెపల్లి గ్రామంలో పెద్దమనిషిగా, పెద్ద పేరుతో బతికిన 'కనికీర' పేరు రికార్డుల్లో నమోదు కాని దుక్కాన్ని యెగపోసుకునే యాతనే ఈ యెతుకులాట.

నా యాతన జూసి మండలాఫీసరు "మీ తల్లి పేరు యెండ్ల దొరికే అవకాశం లేదమ్మా, ఓ పాలి ఓటరు లిస్టు కూడా యెతుక్కోండ్రి" అని సలహా ఇచ్చిండు. సరేనని సర్పంచినడిగితే, "పంచాదాఫీసుల పదేండ్ల ఓటరు లిస్టే ఉంటది, అంతకన్నా పాతయి మండలాఫీసుల్నే దొర్కుతయన్నడు. కనికీరవ్వ పదారేండ్ల కిందనే చనిపోయింది. మళ్ళా మండలాఫీసుకే వచ్చి పదారేండ్లకు ముందున్న ఓటర్ లిస్టు కోసం మూడు రోజులు యెతికిన. మూడో రోజు మూడు గంటలకు ఒక కాయితం బండిల్‌లోని ఒక కాయితం షీటుల మా అవ్వ పేరు మంచును, మబ్బును దులుపుకొని మెరిసే సూర్యకాంతోలె 'కనక వీరమ్మ' అని కనబడ్డది. ఆ పేరు... అట్లా అక్షరాల్లో పొదిగిన ఆ పేరు చూడంగనే నా ఆనందానికి ఆనకట్టల్లేవు. ఆ అక్షరాల పేరును కండ్ల నిండ నింపుకున్న, చేతుల నిండ తాకిన. మల్లా మా అవ్వ బతికొచ్చినంత సంతోషమైంది. ఎదురుగ నిల్చున్నట్లనిపిచ్చింది. నా కన్నతల్లి బతికున్న ఆనవాల్లు, వాటి నమోదులు దొరికినందుకు దుక్కం, సంబురం కలెబడి పొంగి యెగదన్నినయి.

'కనక వీరమ్మ' అనే పేరున్న కాయితంను అపురూపంగా కాపీ చేయించుకుని  మండలాఫీసుల అందరికీ థాంక్స్ చెప్పి, యుద్ధం గెలిసినంత ఆనందంతో ఇంటికొచ్చిన.

బతికిన ఆనవాల్లయినా పాపుకోని బాంచ మహిళల సొదలివి. మా ముసలవ్వలు సాహిత్యాల రికార్డుల లేరని నారాజైన. రందిబడిన. కాని వాల్లు బతికిన ఆనవాల్ల నమోదుల రికార్డు కూడా లేకపోవుడు మామూలు యెతగాదు. ఈ యెత నా మట్టితల్లి దొక్కదానిదే గాదు, ఇంకా అనేక కోట్ల ఎట్టితల్లులది, మట్టితల్లులందరిదీ.

..................................................................

రచయిత్రి సెల్ : 94410 91305




# సొగసుల దేశం : స్లొవేనియా

**మావారు ఆఫీసు పనిమీద స్లొవేనియా దేశం వెళుతూ తనతో పాటు నన్నూ రమ్మన్నారు. అలాంటి అవకాశం మళ్లీ రాదని వెంటనే ఒప్పుకుని బయలుదేరాను. మధ్య యూరపులో ఉన్న చిన్న దేశం స్లొవేనియా. దీనికి ఉత్తరాన ఆస్ట్రియా, పడమరన ఇటలీ, ఈశాన్య దిశలో హంగరీ, నైరుతిలో క్రోషియా ఉన్నాయి. ఆల్ప్సైన్ పర్వతాలు, మహారణ్యాలు, సుమారు 100 దుర్గాలు, అనేక చారిత్రాత్మక పట్టణాలు, ఎడ్రియాటిక్ సముద్రతీరం ఉన్న దేశం స్లొవేనియా. దేశ విస్తీర్ణం 20, 273 చదరపు కిలోమీటర్లు. జనాభా 20 లక్షలు.**

స్లొవేనియాలో రెండు ముఖ్యమైన నగరాలను చూశాం. ఒకటి లుబ్లియానా. స్లొవేనియా రాజధాని. రెండోది మారిబోర్. మావారికి ఆఫీసు పని మారిబోర్‌లో ఉండడం వల్ల ముందు మారిబోర్‌కి వెళ్లాం. పొహర్జీ పర్వతశ్రేణి కింద, డ్రావా నది ఒడ్డున వైను తోటలతో విలసిల్లే మారిబోర్, లుబ్లియానాకు 130 కి.మీ. దూరంలో ఉంది. అనేక కట్టడాలకు, అతిథి సత్కారాలకు, రకరకాల వంటకాలకు మారిబోర్ ప్రసిద్ధి.

## ఆ ద్రాక్ష చెట్టు వయసు 440 ఏళ్లు!

మారిబోర్‌లో వైను తయారుచేసే పద్ధతి అతి పురాతనమైనదట. దానికి సాక్ష్యంగా ఝూమిటోవ్‌కా వీధిలో 440 ఏళ్ల నాటి ద్రాక్ష చెట్టు ఒకటి ఇప్పటికీ సజీవంగా ఉంది. ప్రపంచంలోనే అతిపురాతనమైన చెట్టుగా గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో కూడా చోటు దక్కించుకుందీ చెట్టు. ప్రతి సంవత్సరం ఈ ద్రాక్షచెట్టు 55 కిలోల పళ్లను ఇస్తుందని చెప్పారు. ఆ పళ్లను మెరనోవా ఎస్టేట్స్‌కి తీసుకెళ్లి అక్కడి సెల్లార్‌లో వైను తయారుచేస్తారు. కోతకాలంలో అనగా అక్టోబర్ మొదట్లో ఓల్డ్ వైన్ ఫెస్టివల్ కూడా జరుగుతుంది ఇక్కడ.

మారిబోర్‌లోని పురాతన కట్టడాలలో చెప్పుకోదగ్గవి సినగాగ్, జడ్జిమెంట్ టవర్, వాటర్ టవర్. మొదటి రెండూ 14వ శతాబ్దం నాటివి. డ్రావా నదికి దక్షిణం వైపున ఉన్న జడ్జిమెంట్ టవర్‌లు, వాటర్ టవర్ తురుష్కుల దాడులను ఎదుర్కొనటానికి కట్టినట్లు చెబుతారు. 14వ శతాబ్దంలో కట్టిన జడ్జిమెంట్ టవర్‌లో మంత్రగాళ్లను విచారించి శిక్షలు విధించేవారని, అందుకే ఆ టవర్‌కు ఆ పేరు వచ్చిందని తెలుసుకున్నాం. ఈ టవరుకు తూర్పున ఉన్న వాటర్ టవర్ 16వ శతాబ్దంలో కట్టబడింది. ప్రస్తుతం దీన్ని వైను మ్యూజియంగా మార్చారు. 300 రకాలైన స్లొవేనియా వైన్లను మనం ఇక్కడ రుచి



440 ఏళ్ళ నాటి ద్రాక్ష చెట్టు - మారిబోర్

చూడవచ్చు.

**చలువరాతి ప్లేగు మెమోరియల్**

మరో ముఖ్యమైన పురాతన కట్టడం మారిబోర్ కాజిల్. ఇది ఒక పెద్ద ఇల్లులా కనిపిస్తుంది. చక్రవర్తి ఫ్రెడరిక్ - III, 1478 - 83 మధ్యకాలంలో కట్టించిన రక్షణ నిర్మాణం ఇది. దీన్ని 1938లో మ్యూజియంగా మార్చారు. మారిబోర్ చుట్టుపక్కల ప్రాంతాలకు సంబంధించిన కళాఖండాలను సేకరించి ఇందులో పెట్టారు. పోప్ పయస్-4, హిట్లర్ ఈ మ్యూజియాన్ని సందర్శించినట్టు సాక్ష్యాలున్నాయి.

గ్లావిని స్క్వేర్ మారిబోర్‌లోని అతి పెద్ద కూడలి. అక్కడ మన చార్మినార్‌లా ఒక ప్లేగ్ మెమోరియల్ ఉంది. 17వ శతాబ్దంలో ప్లేగు వ్యాధి ప్రబలినపుడు నగరంలోని మూడోవంతు ప్రజలు మరణించారట. దానికి గుర్తుగా ఈ మెమోరియల్ 1681లో కట్టారు. పూర్తిగా చలువరాతితో కట్టిన దీనికి దీర్ఘచతురస్రాకారపు పీఠం, పీఠం మీద స్తంభము, దానిమీద మేరీ విగ్రహం ఉన్నాయి. ఆమె కిరీటంలో 12 నక్షత్రాలు, కాళ్ల దగ్గర చందమామ ఉన్నాయి. పీఠం చుట్టూ ఆరుగురు సెయింట్స్ ఉన్నారు. ప్లేగు వ్యాధినుంచి తమని రక్షించమని పట్టణ ప్రజలు వారిని ప్రార్థించినట్లు తెలుస్తోంది. అక్కడే 1515లో కట్టిన టౌన్‌హాల్ ఉంది. 1941లో హిట్లర్ ఈ టౌన్‌హాల్ బాల్కనీ నుంచి ప్రసంగించినట్లు చెబుతారు.

జూన్ మాసంలో ద్రావా నది ఒడ్డున మూడు వారాల పాటు లెంట్ ఫెస్టివల్ జరుపుకుంటారు. మేం వెళ్లినపుడు ఆ పండుగ జరుగుతుండడం, దానిలో పాల్గొనే అవకాశం మాకు కలగడం మా అదృష్టం.

మారిబోర్‌లో రోప్‌వే కూడా ఉంది. ఎత్తైన పోహార్జే కొండ మీదకి కేబుల్ కార్లో పిల్లలు సైకిళ్లను తీసుకెళ్తూ కనిపించారు. బైసికల్ రైడ్స్ చేయడానికి ఆ కొండ బాగా అనువు అట. రకరకాల వృక్షాలతో ఉన్న ఆ కొండ చాలా నిండుగా, ఆకర్షణీయంగా అనిపించింది.

**లుబ్లియానా నగర అందాలు**

తర్వాత రాజధాని లుబ్లియానాకి వెళ్లాం. ఆ నగరపు చిహ్నం డ్రాగన్. లుబ్లియానా కోట బురుజు మీద డ్రాగన్ గుర్తు మనకు కనబడుతుంది. ఈ కోటను చూడడానికి టూరిస్టులు బాగా వస్తారు. రెండో ప్రపంచ యుద్ధ సమయంలో దీన్ని జైలులా వాడారట.

లుబ్లియానాలో చారిత్రకంగా, రాజకీయంగా ప్రసిద్ధిగాంచిన స్క్వేర్లు ఎన్నో ఉన్నాయి. నగరం మధ్యలో ఉన్న ప్రెషరెన్‌స్క్వేర్‌లో వారి జాతీయ కవియైన ఫ్రాన్సే ప్రెషరెన్ విగ్రహం ఉంది. స్లొవేనియా జాతీయ గీతాన్ని రాసిన రచయిత ఆయన. ఆయన వర్ధంతి రోజున అనగా ఫిబ్రవరి 8న స్లొవేనియా ప్రజలు ప్రెషరన్ కవిత్వాన్ని ఆయన విగ్రహం ముందు చదువుతారట.



ప్లేగ్ మెమోరియల్

రిపబ్లిక్ స్క్వేర్ లుబ్లియానాలో మరో పెద్ద స్క్వేర్. 1991 జూన్ 25న స్లొవేనియాకు స్వాతంత్ర్యాన్ని ఇక్కడే ప్రకటించారు. నేషనల్ అసెంబ్లీ భవనం దీనికి ఉత్తరాన ఉంది. కాంగ్రెస్ స్క్వేర్ లుబ్లియానాలో ప్రముఖమైనది. రాజకీయ కార్యక్రమాలు, నిరసన ప్రదర్శనలు, ఉత్సవాలు జరిపేందుకు దీనిని ఉపయోగిస్తారు. ఈ స్క్వేర్‌లో ఉన్న కట్టడాలలో ముఖ్యమైనది లుబ్లియానా యూనివర్శిటీ భవనం.

మమ్మల్ని ఎంతో ఆకర్షించిన స్క్వేర్ టౌన్ స్క్వేర్. అక్కడి టౌన్‌హాల్ 15వ శతాబ్దంలో కట్టబడింది. దీని ప్రవేశద్వారం దగ్గర హెర్క్యులస్ విగ్రహం ఉంది. దీని బాల్కనీ, క్లాక్‌టవర్ చాలా అందంగా ఉంటాయి. లుబ్లియానా సిటీ చిహ్నమైన డ్రాగన్ మనకి ఈ భవనంపైన బంగారపు తొడుగుతో కనిపిస్తుంది. ఈ టౌన్‌హాల్‌కి కొద్దిదూరంలో రోబ్బా అనే శిల్పి 1751లో డిజైను చేసిన మూడు నదుల ఫౌంటెన్ ఉంది. ఇది రోమ్ నగరంలో ఉన్న నాలుగు నదుల ఫౌంటెన్ రీతిలో కట్టినట్లు చెప్పారు.



లుబ్లియానికా నది

**ఎటు చూసినా మ్యూజియాలే**

లుబ్లియానా వంతెనలకి కూడా ప్రసిద్ధి. లుబ్లియానికా నది మీద ఉన్న డ్రాగన్ వంతెనను ఇరవయ్యో శతాబ్దం మొదట్లో కట్టారు. దీనిమీద నాలుగు డ్రాగన్ విగ్రహాలున్నాయి. స్థానికంగా ప్రచారంలో ఉన్న కథ ప్రకారం కన్నెపడుచులు ఈ వంతెనను దాటుతున్నప్పుడు డ్రాగన్లు వాటి తోకలను ఊపుతాయట! లుబ్లియానికా నదిమీద ట్రిపుల్ బ్రిడ్జెస్ అనగా మూడు వంతెనలు ఉంటాయి. 2007 నుంచి ఈ వంతెనల మీద ట్రాఫిక్‌ను నిలిపివేసి కేవలం ప్రజలు కాలినడకన ప్రయాణం చేసేందుకు వాడుతున్నారు. బుచర్స్ వంతెన మీద గ్రీకు పురాణాలకు, బైబిల్ కథలకు ప్రతీకలుగా ఉన్న అనేక శిల్పాలు ఉన్నాయి. ఈ వంతెన మీద ఉన్న ఇనుప వైర్లకు ప్రేమికులు తమ ప్రేమకు గుర్తుగా తాళాలు వేసే ఆచారం ప్రారంభం అయింది.

ఐదు కిలోమీటర్లున్న టివోలీ పార్కు లుబ్లియానాలో అతి పెద్ద పార్కు. ఇది రకరకాల వృక్షాలతో, పువ్వులతో, విగ్రహాలతో, ఫౌంటెన్లతో కన్నుల పండుగగా ఉంటుంది. ఈ పార్కు దగ్గరలోనే నేషనల్ మ్యూజియం ఆఫ్ కంటెపరరీ హిస్టరీ, స్పోర్ట్స్ హాలు ఉన్నాయి.

లుబ్లియానాలో 14 మ్యూజియాలు, 56 ఆర్ట్ గ్యాలరీలున్నాయట. రైల్వే మ్యూజియం, స్పోర్ట్స్ మ్యూజియం, ఆర్కిటెక్చర్ మ్యూజియం, స్కూలు మ్యూజియం ఇలా ఎన్నో. అన్నీ చూడడం మాకు ఎలాగూ కుదరలేదనుకోండి.

స్లొవేనియా దేశవాసుల గురించి కూడా చెప్పుకోవాలి. వాళ్లు ఎంతో స్నేహభావంతో ఉన్నారు. ఏ సహాయం అడిగినా చేయడానికి ముందుకొచ్చారు. స్లొవేనియన్ భాష తర్వాత ఇంగ్లీషు అక్కడ ప్రముఖమైన విదేశీ భాష. చాలామందికి ఇంగ్లీషు వచ్చు.

మైమరపించే ప్రకృతితో, చారిత్రాత్మక కట్టడాలతో, రకరకాల మ్యూజియాలతో, స్నేహభావంతో మెలిగే ప్రజలతో మమ్మల్ని ఎంతో అలరించింది స్లొవేనియా. కేవలం రెండు పట్టణాలనే చూసినా మాలో ఎంతో సంతృప్తిని మిగిల్చింది. మిగతా ప్రదేశాలు కూడా చూస్తే ఇంకెంత ఆనందం కలుగుతుందో అనే భావన కలిగింది.

**- శాంతిశ్రీ బెనర్జీ, ఢిల్లీ**

## ఇవీ వచ్చాయి

**కౌలు రైతు**
**రచన :** తాళ్ళూరి లాబన్ బాబు
**పేజీలు :** 154, **వెల :** రూ.150
**ప్రతులకు :** 96767 97777

**మూర్తీస్ మ్యూజింగ్స్**
**రచన :** మూర్తి కె.వి.వి.ఎస్
**పేజీలు :** 78, **వెల :** రూ.100
**ప్రతులకు :** విశాలాంధ్ర, నవచేతన

**శిఖరం**
(అటల్ బిహారీ వాజ్‌పేయి కవిత్వం)
**అనుసృజన :** జె. సత్యనారాయణ
**పేజీలు :** 96, **వెల :** రూ.100
**ప్రతులకు :** 98494 44944

**తెలంగాణలో తొలి రామాయణం బతుకమ్మ పాట**
**రచన :** బుక్క సిద్ధాంతి
**పేజీలు :** 140, **వెల :** రూ.100
**ప్రతులకు :** 94407 04535

**స్నాన నియమాలు ఆహార నియమాలు**
**రచన :** కాశీభట్ల సుబ్బరామశర్మ
**పేజీలు :** 100, **వెల :** రూ.50
**ప్రతులకు :** 96763 55863

**ఖగోళ శాస్త్ర చరిత్ర**
**రచన :** డా. వి. శ్రీనివాస చక్రవర్తి
**పేజీలు :** 158, **వెల :** రూ.100

**గణిత గారడీలు**
**మూలం :** యూకోవ్ పెరెల్మాన్
**తెలుగు :** డా. వి. శ్రీనివాస చక్రవర్తి
**పేజీలు :** 94, **వెల :** రూ.60

**ఆన్ ఫ్రాంక్ ఓ బాలిక డైరీ**
**తెలుగు :** బీనాదేవి
**పేజీలు :** 208, **వెల :** రూ.125
**ప్రతులకు :** ప్రముఖ పుస్తక కేంద్రాలు

**గండికోట**
**రచన :** తవ్వా ఓబుల్‌రెడ్డి
**పేజీలు :** 128, **వెల :** రూ.100
**ప్రతులకు :** 94400 24471

**మహాభారతం ప్రమదావలోకనం**
**రచన:** ప్రభల (నముడూరి) జానకి
**పేజీలు :** 442, **వెల :** రూ.250
**ప్రతులకు :** 90004 96959

## కొత్త పుస్తకాలు

# నోబెల్ సాహిత్య పులకింత 'పాలపుంత'



ఇంచుమించు పాతికేళ్ల క్రితం కె.సదాశివరావుగారు 'నోబెల్ సాహిత్య వ్యాసాలు' రాయడం ప్రారంభించారు. ప్రతి సంవత్సరం నోబెల్ సాహిత్య పురస్కార ప్రకటన వెలువడిన వెనువెంటనే ఆయన ఆ పురస్కార గ్రహీత గురించి సవివరమైన వ్యాసం రాసేవారు. అనితరసాధ్యమైన ఈ పనిని సాధించిన ఘనత సదాశివరావుగారొక్కరికే దక్కింది. ఆ రోజుల్లో కంప్యూటర్లూ, వెబ్ సైట్లూ వంటివి లేకపోయినా ఎన్నో ఏళ్లనుంచి 'వరల్డ్ లిటరేచర్ టుడే', 'ది న్యూయార్కర్', 'బుక్స్ ఎబ్రాడ్', 'పారిస్ రెవ్యూ' వంటి పత్రికలు చదివే అలవాటు ఉండటం వల్ల ఆయన తన వ్యాసాలతో పెద్దల మన్ననలూ, తోటివారి అభినందనలూ పొందగలిగారు.

నోబెల్ పురస్కార గ్రహీతల పుస్తకాలు చదివి ఊరుకోకుండా, వారిలో కొందరిపై విపరీతమైన అభిమానాన్ని పెంచుకుని, వారితో వ్యక్తిగతంగా పరిచయం ఏర్పరచుకోవాలని కూడా ప్రయత్నించారు ఆయన. కథారచయిత్రి ఏలిస్ మన్రోకి ఉత్తరం రాసినపుడు ఆవిడ వృద్ధాప్య దశలో కాన్సర్ వ్యాధితో బాధ పడుతున్నా ఆయనకి స్వదస్తూరిలో మంచి జవాబు రాసింది. దాన్ని ఈ పుస్తకానికి రాసిన 'ముందుమాట'లో చేర్చి పాఠకులకు స్ఫూర్తిని కలుగజేసేటట్లు చేశారు సదాశివరావుగారు.

1990లో నోబెల్ సాహిత్య పురస్కారం పొందిన ఒక్టావియో లొజానో పజ్‌తో ప్రారంభించి 2014లో అదే బహుమతి పొందిన పాట్రిక్ మోడియానో వరకు ప్రతి ఒక్క నోబెల్ సాహిత్య బహుమతి గ్రహీత గురించీ ఆయన ఈ పుస్తకంలో రాశారు. మొత్తం 25 మంది పురస్కార గ్రహీతల గురించిన వ్యాసాలతో పాటు 'నోబెల్ ఎవరికి?', 'నోబెల్ గంధం ఎవరికి?' అనే ఆసక్తిని రేకెత్తించే నోబెల్ పురస్కార ప్రదానపు నేపథ్య విశేషాల్ని తెలిపే వ్యాసాలు కూడా ఇందులో ఉన్నాయి. ఇదంతా మొదటిభాగం.

రెండవ భాగంలో నోబెల్ సాహిత్య పురస్కార గ్రహీతల కథలు ఐదింటికి తాను చేసిన తెలుగు అనువాదాల్ని చేర్చారు. ఆ కథల రచయితలు - హోర్హెలూయి బోర్హెస్ (స్పానిష్), కారెల్ ఛాపెక్ (చెక్), కెంజాబురో ఓయి (జపనీస్), ఆంటన్ ఛెకోవ్ (రష్యన్). బోర్హెస్‌వి రెండు కథల్ని అనువదించారు. మూడవభాగంలో ఆయన వైవిధ్య పూరితమైన అభిరుచినీ, సృజనాత్మకతనీ వ్యక్తం చేసే వ్యాసాలు, వివిధ శాఖల్లో విశిష్టవ్యక్తులపై ఆయనకున్న అభిమానాన్నీ, స్నేహాన్నీ వ్యక్తం చేసే రచనలూ ఉన్నాయి.

కె. సదాశివరావు పోలీసు శాఖలో ఉన్నత స్థాయిలో ఉద్యోగ నిర్వహణ చేస్తూ కూడా విశిష్ట రచయితగా, చిత్రకారుడిగా, విమర్శకుడిగా ప్రసిద్ధులవడం అత్యంత అభినందనీయం. ఉద్యోగ విరమణ తరవాత కూడా అనుక్షణం తన అభిరుచుల ప్రకారం సృజనాత్మకంగా గడపటం హర్షణీయం, స్ఫూర్తిదాయకం.

**- అబ్బూరి ఛాయాదేవి**

**పాలపుంత : నోబెల్ సాహిత్య వ్యాసాలు ఇతరాలూ ... ;** కె. సదాశివరావు
**పేజీలు :** 282, **వెల :** రూ.150, **ప్రతులకు :** ఎమెస్కో - 040 - 23264028

---

# వానొచ్చింది.. గుండె తడిసింది!

అనేకానేక సమకాలీన రాజకీయ ఆర్థిక సామాజిక కారణాల మూలంగా తెలుగు కవుల అస్తిత్వాంతరంగంలో క్రమక్రమంగా పెరిగిపోతున్న ఒంటరితనమూ, నిర్లిప్త ఏకాంతికతను కవిత్వ రూపంలో ఉంచిన ఒక ప్రాంత నాస్టాల్జిక్ పదవాక్యాల సమూహం నారాయణస్వామి 'వానొస్తద?' కవిత్వం. తన జీవితానుభవంలోని విశాల ప్రాపంచిక వాస్తవికత తాలూకు సందేహాలూ, స్వప్నాలూ, సంయోగ వియోగాలను కవి తన ఊరి భాషలో, యాసలో కవిత్వీకరించడం ఈ నలభై రెండు కవితల పుస్తకం ప్రత్యేకత.



అడియాశలవుతున్న ఆశలూ, అసంతృప్త గతమూ, అనాధీన భవిష్యత్తూ, వర్తమానపు నైరాశ్యం, తన ఉనికిని తాను నిర్ణయించలేని అభద్రత, ఆశల అశక్తతా ఈ కవితల నేపథ్యపు గాఢతాత్వికత. కాలం చెల్లిన (?) ఫ్రాయిడియన్ పరిభాషలో తల్లినీ, తల్లిప్రేమనూ నిర్విరామంగా అనేక సంఘటనల అనుభవాల నేపథ్యంలో అన్వేషించాడు కవి. గత రెండు, మూడు దశాబ్దాలుగా తెలుగు నేలను కమ్ముకొన్న విప్లవ, దళిత ఉద్యమాల మాండలికపు సొంత అస్థిత్వంలోంచి వ్యక్తం చేసిన కవితలివి.

కవిత్వంపై చాలాకాలం తర్వాత కె. శ్రీనివాస్ రాసిన ముందుమాట 'లోన కురిసే వాన' తప్పకుండా చదవదగ్గది.

**- లెనిన్ ధనిశెట్టి**

**వానొస్తద?,** నారాయణస్వామి
**పేజీలు :** 186, **వెల :** రూ.150, **ప్రతులకు :** నవచేతన, నవోదయ, www.kinege.com

## హెపటైటిస్, హెర్పిస్‌లకు చెక్

**హెపటైటిస్** వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వ్యాధి నిర్ధారణ కోసం హెపటైటిస్-బి(హెచ్‌బిఎస్ ఏజి) పరీక్ష చేయించాలి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. కొన్ని ఏళ్ల నుంచి వైరస్ ఉన్నవారిలో కాలేయం క్రమంగా దెబ్బతింటూ లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

### హెర్పిస్ సింప్లెక్స్

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వ్యాధులను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టదు.

## ఆస్తమా శాశ్వతంగా పోదని ఎవరన్నారు?

**ఆస్తమా, సైనసైటిస్...** రెండు వేరు వేరు వ్యాధులైనా రెండింటికి సంబంధం ఉంది. దీర్ఘకాలంగా సైనసైటిస్‌తో బాధపడుతున్నప్పుడు ఆస్తమాగా మారే అవకాశం ఉంటుంది. వేగంగా వ్యాపిస్తోన్న వ్యాధుల్లో ఆస్తమా ఒకటి.

**కారణాలేంటి? :** 5 మైక్రాన్ల కన్నా తక్కువ ఉండే పార్టికల్స్ సైనస్‌లో ఆగకుండా నేరుగా ఊపిరితిత్తుల్లోకి వెళ్లిపోతాయి. వీటిని బయటకు పంపించడానికి శరీరం ప్రయత్నిస్తుంది. ఫలితంగానే తుమ్ములు వస్తుంటాయి. అంతేకాకుండా వాతావరణ కాలుష్యం, ఇంట్లో పరిసరాలు శుభ్రంగా లేకపోవడం, దుమ్ము, ధూళి ఎక్కువగా ఉండే ప్రదేశాల్లో ఉండటం వంటివి ఆస్తమాకు, సైనసైటిస్‌కు కారణమవుతాయి.

**లక్షణాలు :** తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది.ముక్కు నుంచి పసుపు పచ్చని, ఆకుపచ్చని ద్రవాలు రావడం మొదలవుతుంది. ఆస్తమాలో కనిపించే ప్రధాన లక్షణాలు దగ్గు, ఆయాసం. పిల్లికూతలు కూడా ఉంటాయి. కొంత మందిలో దగ్గు మాత్రమే ఉంటుంది. దీంతోపాటు ఛాతీ పట్టేసినట్లుగా ఉంటుంది.

### హోమియోతో దూరం

మూలకారణాన్ని తొలగించే విధంగా హోమియో వైద్యం ఉంటుంది. హోమియో చికిత్స తరువాత వ్యాధి తిరిగి రావడం అంటూ జరగదు. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇతర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. కానీ హోమియో వల్ల సైనసైటిస్, ఆస్తమా శాశ్వతంగా తగ్గుతాయి.


**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106




## హెచ్‌ఐవి ఉంటే మరణం తప్పదా?

**హెచ్‌ఐవికి** చికిత్స లేదా? హెచ్‌ఐవి సోకితే మరణమేనా! అంటే కానే కాదు. హెచ్‌ఐవి సోకినా అందరిలాగే సాధారణ జీవితం, ఆరోగ్యవంతమైన జీవితం గడపవచ్చు. ఎప్పటికీ ఎయిడ్స్‌గా మారకుండా చూసుకోవచ్చు. ఒక్కమాటలో చెప్పాలంటే హెచ్‌ఐవి వైరస్‌ను హోమియో మందులతో కట్టడి చేయవచ్చు.

### లక్షణాలు కనిపించడానికి....

హెచ్‌ఐవి శరీరంలోకి ప్రవేశించగానే ఎటువంటి మార్పులు కనిపించవు. కొన్ని సంవత్సరాల తరువాత వ్యాధికి సంబంధించిన లక్షణాలు ప్రారంభమవుతాయి. అంటే సీడీ 4 కణాల సంఖ్య తగ్గిపోయిన తరువాత వ్యాధి లక్షణాలు కనిపిస్తాయి. హెచ్‌ఐవి శరీరంలో ప్రవేశించిన తరువాత ఎన్ని రోజులకు బయటపడవచ్చని అనేది వారి ఆహారపు అలవాట్లు, ఆరోగ్యస్థితి, ఇతర వ్యాధులపై ఆధారపడి ఉంటుంది. కొందరిలో ఐదారేళ్లకే సీడీ 4 కణాలు బాగా తగ్గిపోయి ఇన్‌ఫెక్షన్లు మొదలవుతాయి. మరికొందరిలో పదేళ్లు పడుతుంది.

### హోమియో చికిత్స ఎలా పనిచేస్తుంది

హోమియో మందుల వల్ల సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. అవకాశవాద ఇన్‌ఫెక్షన్లకు చోటు లేకుండా పోతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హెచ్‌ఐవి అని తెలియగానే మరణం తప్పదనే భావనలో ఉంటారు. కానీ అది నిజం కాదు. హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా అందరిలాగే సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది. హెచ్‌ఐవి ఎయిడ్స్‌గా మారకుండా నిరోధించవచ్చు.. ఒకసారి హెచ్‌ఐవి సోకాక దాన్ని పూర్తిగా తొలగించే మందులు లేవు. అయితే హోమియో మందులతో వైరస్‌ల సంఖ్య అతి తక్కువ స్థాయికి చేరుకునేలా చేయవచ్చు.

## పైల్స్ ఉంటే రోజూ నరకమేగా?

**పైల్స్, ఫిషర్** సమస్యలతో బాధపడే వారి సంఖ్య తక్కువేమీ కాదు. కాకపోతే, సమస్య మరీ తీవ్రమై భరించలేని స్థితికి వస్తే కానీ , చాలా మంది డాక్టర్‌ను సంప్రదించరు. ఈ సమస్యలు ఉన్నవారిలో ఎక్కువ మంది శస్త్ర చికిత్సలకు వెళతారు. నిజానికి శస్త్ర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం లభిస్తుందే తప్ప అది సమస్యను సంపూర్ణంగా తొలగించదు. వ్యాధి మూలాలను సమూలంగా తొలగిస్తే గానీ ఈ సమస్యలు పూర్తిగా కనుమరుగైపోవు.

**అర్శమొలలు(పైల్స్) :** మలద్వారం పక్కన ఉండే ధమనులు ఉబ్బిపోవడాన్నే అర్శమొలలు అంటారు. ఈ సమస్య ఉన్న వారిలో మల విసర్జన సమయంలో రక్తం పడుతుంది. కొన్నిసార్లు రక్తం మలంతో కలిసి వస్తుంది. గర్భిణీ స్త్రీలలో కూడా పైల్స్ సమస్యకు గురయ్యే వారు ఎక్కువే. కాకపోతే ప్రసవం తరువాత చాలా మందిలో తగ్గిపోతాయి.

**యానల్ ఫిషర్ :** కొన్నిసార్లు మలద్వారం వద్ద చర్మం చిట్లిపోయి రక్తస్రావం అవుతూ ఉంటుంది. మలవిసర్జన సమయంలో, విసర్జన తరువాత కూడా మంటగా ఉండడం. కొందరిలో విసర్జనకు ముందుగానే రక్తం పడుతుంది.

### హోమియో వైద్యం

పైల్స్‌కు సంబంధించిన వైద్యంలో హోమియోలో ఒక విలక్షణమైన విధానం ఉంది. ప్రత్యేకించి దెబ్బతిని వాచిపోయిన ధమనులను తిరిగి పూర్వస్థితికి తెచ్చే సామర్థ్యం హోమియో మందులకు ఉంది. అందుకే ఇక్కడ పైల్స్ సమస్య శాశ్వతంగా తగ్గిపోతుంది. రోగికి అతి త్వరితంగా ఉపశమనం లభిస్తుంది. ఫిషర్ సమస్యకు శాశ్వత పరిష్కారం లభిస్తుంది. ఎలాంటి దుష్ప్రభా వాలూ లేకుండా పైల్స్, ఫిషర్‌లనూ సమూలంగా తొలగించే సామర్థ్యం హోమియోకి ఉంది.

